# తుండము నేకదంతమును...

(వినాయక చవితి పూజా మంత్రాలూ - అర్థమూ - కథా - విశేషాంశాలూ)



: రచన :

'రామాయణ ప్రవచన సుధాకర' 'రామాయణ సుధానిధి' 'భాషాప్రవీణ'

**డాక్టర్. మైలవరపు శ్రీనివాసరావు**

ఎం.ఏ., (తెలుగు), ఎం.ఏ., (సంస్కృతము), పిహెచ్.డి.,

5-21-37, 2/6 బ్రాడీపేట, గుంటూరు - 522 002. (ఆం.ప్ర.)

: ముద్రింపించిన ఉదారులు :

**శ్రీయుతులు చెన్నావఝ్ఝల శారదా మల్లికార్జున ప్రసాద్ దంపతులు**

**తమ తండ్రి**

**చెన్నావఝ్ఝల లక్ష్మీనరసింహమూర్తి గారి స్మృతికి**

అర్లింగ్టన్ - వర్జీనియా 22204.

Cross Roads Professional Counselling Centres P.C.

611, South Carlin Springs Rd., Suite 301,

Arlington, VIRGINIA - 22204.

Ph : (H) 703-903-9565, Fax : 703-578-0603

Appointment : 703-578-0907.

బహుధాన్య భాద్రపద శుద్ధ చవితి. 26-8-'98. వెల : రూ. 10



మా ఇలవేల్పు

లక్ష్మీ నృసింహస్వామితో



మా తలిదండ్రులు

చెన్నావఝల జ్ఞాన
ప్రసూనాంబా లక్ష్మీ
నరసింహమూర్తి

దంపతులు

-డా॥ C.M. ప్రసాద్

గ్రంథ ముద్రాపయిత

# విషయ సూచిక

# ............. లక్ష్మీ నరసింహ మూర్తిగా రన్నమాటే!

ఎవరైనా పెద్ద ధ్వనితో నవ్వుతూ -

నవ్వుతూన్న ఆ వేళలో కళ్లు చికిలించుకుపోతూ -

అదే సమయంలో బోసినోరు మొత్తం తెరుచుకుని ఆ నవ్వు నిష్కల్మషంగా ఉందని మీకు అనిపిస్తే ..................................**ఆయన లక్ష్మీనరసింహమూర్తిగారన్నమాటే!**

ఈ రోజుల్లో హోదాకోసం అంబాసిడర్ కారులో వెళ్తున్నట్టు, ఆ రోజుల్లో జూట్ మిల్లులో తెలుగు ఉత్తరాలకి హిందీ అనువాదకునిగా కంపెనీవారు పంపిన రిక్షాలో వెళ్తూ మీ స్మృతిపథంలో ఎవరైనా గోచరిస్తే ..........**ఆయన లక్ష్మీనరసింహమూర్తిగారన్నమాటే!**

సంప్రదాయబద్ధమైన ఖద్దరు పంచె - పొట్టి చేతుల చొక్కా - మెడకి రెండువైపులా సమానంగా వేలాడుతూ ఒక కండువా, చేతి మణికట్టుకి ఒక సంచీ, నుదుట తిర్యక్పుండ్రాలతో (శివనామాలు) ఎవరైనా కంటికి అగుపడితే ....**ఆయన లక్ష్మీనరసింహమూర్తిగారన్నమాటే!**

ఒక సంస్కృత కళాశాలకి కరస్పాండెంటుననే దర్పంగానీ - ఒక పెద్ద రవికళాశాలకి ఒకప్పటి మేనేజరుననే అహంకారంగానీ - తన పిల్లలంతా స్వదేశ విదేశాల్లో పెద్దపెద్ద హోదాల్లో ఉన్నారనే భేషజంగానీ - ఏమాత్రమూ చూపకుండా "అంతా ఆ ఓంకారక్షేత్రం గాయత్రీమాత చలవే" అని భావిస్తూ ప్రతిదినం ఉదయం సాయంత్రం ఆ తల్లికి నమస్కరిస్తూ ఎవరైనా మీక్కనిపిస్తే ఇంకేం ? నిశ్చయంగా ........**ఆయన లక్ష్మీనరసింహమూర్తిగారన్నమాటే!**

హిందీ భాషాప్రవీణలో ఉత్తీర్ణులై ఆ భాషమీది మక్కువ కారణంగా హిందీభాషకి ప్రైవేట్లు చెప్తూ 'నెలకి అయిదు రూపాయలు మాత్రమే' ఫీజుతో 'అయిదురూపాయల మేస్టా'రుగా ఎవరైనా మీకు గుర్తులో ఉంటే ....**ఆయన లక్ష్మీనరసింహమూర్తిగారన్నమాటే!**

ఎవరి పంచనా పడకుండా, ఏ మంచానా తీసుకోకుండా నిత్యం ధ్యానపరులై జీవిస్తూ అకస్మాత్తుగా పరమేశ్వరునిలో చేరిన శ్రీ నరసింహమూర్తిగారి ఆత్మకి శాంతి కలగాలని వారి యిష్టదైవమైన లక్ష్మీనరసింహస్వామినే ప్రార్థిస్తూ .....

శ్రీ లక్ష్మీనరసింహ మూర్తిగారి మరణానికి
ముందు రోజుకూడా చాలసేపు ఇష్టగోష్ఠి చేసిన
- మైలవరపు శ్రీనివాసరావు.

*(మాంగల్య తంతునానేన అనే నా గ్రంథపు మూడవ ముద్రణని చేయించిన డా॥ C.M. ప్రసాద్ గారి తండ్రే ఈ శ్రీ చెన్నావఝల లక్ష్మీ నరసింహమూర్తిగారని గమనించగలరు.)*

శ్రీయుతులు



**కీ॥ శే॥ చెన్నావజ్ఝల లక్ష్మీనరసింహమూర్తిగారు**

(మా తండ్రిగారు)

శ్రీయుతులు

**చెన్నావఝల శారదా**
**మల్లికార్జున ప్రసాద్**
**దంపతులు**

తమ సంతానం

**బృహస్పతి,**
**వేదలక్ష్మి,**
**హిరణ్మయిలతో**



ఓం

శ్రీ శివాయ నమః

# తుండము నేకదంతమును....

**శ్రీరస్తు** **శుభమస్తు** **అవిఘ్నమస్తు**

ఎంతటి అదృష్టానికో నోచుకున్నాం కాబట్టే మనకి ఎన్నెన్నో పండుగ లున్నాయి. అన్ని పండుగల వెనుకా అనేక ఆధ్యాత్మిక రహస్యాలూ - వైద్యశాస్త్ర రహస్యాలూ - ఖగోళ - వ్యవసాయ - విజ్ఞాన శాస్త్ర రహస్యాలూ - పెద్దలని గౌరవించాల్సిన విధానపు తీరు తెన్నులూ - - - ఇలా ఒకటేమిటి? ఎన్నెన్నో రహస్యాలు దాగి ఉన్నాయి.

మఱి వీటినన్నింటినీ తెలుసుకోకుండా ఏదో వినాయక చవితి పూజని మొక్కుబడిగా పూర్తి చేసేసుకుని పోతే అదేమంత సబబు? ఆ పూజ చేసేముందు ఆ వినాయకుణ్ణి గూర్చి తెలుసుకోవలసిన అంశాలనీ, ఆయన చిత్రమైన రూపం వెనుక దాగి ఉన్న రహస్యాలనీ, పూజామంత్రాల అర్థం - దానిలోని మర్మాలనీ తెలుసుకుంటే అది తప్పు కానేకాదు సరికదా - అది ప్రతిభక్తుని విధ్యుక్తధర్మమూ - బాధ్యతా కూడా కదా! అందుకే పెద్దలన్నారు - **జ్ఞాత్వా కర్మాణి కుర్వీత** - ఏ పనినైనా 'గుడ్డిగా అలా చేయడం కాకుండా అర్థం తెలుసుకుని మఱీ చేయవలసింది" - అని.

ఏమో! ఇదంతా (ఈ అర్థాలూ - విశేషాంశాలూ . . . .) మాకు అవసరం లేదనుకుంటారా? పూజామంత్రాలకి అర్థమూ - అంతరార్థమూ కూడ అనవసరమనుకొంటారా? అయితే నేరుగా 47 పుటలోనికి వెళ్లి పూజామంత్రాలూ - కథనీ చదివేసుకుని 'అమ్మయ్య!' అనుకొని చేతులు దులిపేసుకుంటూ, దయ చేసి ఈ ఒక్క శ్లోకం చదువుకోండి. చాలు.

**అన్నం త ద్వ్యంజనై స్సాకం కి త ద్భుక్త్వా పృథక్పృథక్!**

**సర్వం హ్యేకత్ర సమ్మిశ్ర్య సేవ్యతాం తత్ర వో శ్రమః!!**

పప్పూ - కూరా - పచ్చడీ - చారూ - పెరుగూ --- ఇలా ఒకదాని పిమ్మట ఒకదాన్ని అన్నంలో కలుపుకుని తింటూ ఆ రుచిని ఆనందిస్తూ - అనుభవిస్తూ తినడ మెందుకు? వండేటప్పుడే ఆ బియ్యంలోనే ఈ పప్పూ - కూరా - పచ్చడీ . . . ఇలా అన్నింటి కీ కావలసిన ద్రవ్యాలని - ఒక్కసారే వేసేసి వండేసుకుని ఆ మిశ్రమాన్ని తినేస్తే ఎంత శ్రమో తగ్గిపోతుంది గదా!! అని పై శ్లోకానికి అర్థం. నిజమే కదా మఱి !!!

# పండుగల్లో భేదాలూ - వినాయక చవితి విశేషమూ

ఎంతో అదృష్టవంతులం కాబట్టి ఎన్నెన్నో పండుగలు మనకి ఉన్నాయనుకున్నాం కదా! వివరంగా చూద్దాం. మన యింటికి వచ్చిన చుట్టం మనకి ఎంత దగ్గఱ వాడైతే అన్నిరోజులు మనయింట్లో ఉన్నట్టు .. ప్రాముఖ్యాన్ని బట్టి ఒకరోజు పండుగలూ - రెండ్రోజుల పండుగలూ ...... ఇలా నెల రోజుల పండుగలు కూడా ఉన్నాయి. ఉదాహరణకి శ్రీరామనవమీ, కృష్ణాష్టమీ . . . వంటి ఇలాటివన్నీ ఒకరోజు పండుగలైతే, నరక చతుర్దశీ - దీపావళీ వంటివి రెండ్రోజుల పండుగలు.

వినాయక చవితి - విజయదశమి పండుగలు క్రమంగా 9 రోజులు (నవరాత్రాలు) 10 రోజుల పండుగలు (విజయ'దశమి' కదా). ఇక పితృదేవతలని తరింపజేయడానికి ఏర్పడిన 'మహాలయం' (ఈ భాద్రపద కృష్ణపక్షమంతా) 15 రోజుల పండుగ. ఇక 'సంక్రాంతికి నెలపట్టారు' అని అంటూండడం మనం విన్నదే. కాబట్టి సంక్రాంతి అనేది 'నెల రోజుల పండుగ' అన్నమాట.

ఇక ప్రతి సంవత్సరానికీ నెలలుంటాయి గదా! పాడ్యమినుండి పూర్ణిమా అలాగే పాడ్యమి నుండి అమావాస్యా వఱకూ ఉన్న ప్రతి పదిహేనురోజుల్నీ 'పక్షం' అంటారు. అలాటి పక్షాలు నెలకి రెండు చొప్పున ఉంటాయి. ఆలోచించి చూస్తే ప్రతి తిథి పేరిటా ఒక పండుగ కన్పిస్తుంది. ఉదాహరణకి పాడ్యమికి ఉగాదీ - విదియకి ప్రతిమాసపు శుద్ధవిదియా చంద్రదర్శనోత్సవం (నెల పొడుపు పండుగ) - ఇలాగే అక్షతదియా - వినాయక చవితీ - ఋషి పంచమీ - సుబ్రహ్మణ్య షష్ఠీ - రథసప్తమీ - కృష్ణాష్టమీ - శ్రీరామనవమీ - విజయదశమీ- తొలి ఏకాదశీ - క్షీరాబ్ధి ద్వాదశీ - శని త్రయోదశీ- మహా శివరాత్రీ - శ్రావణపూర్ణిమా - దీపావళి అమావాస్యా అనేవి కన్పిస్తాయి.

కర్కాటక సంక్రమణం - మకర సంక్రమణం (జనవరి 14 మఱియు జులై 16) అనేవి ప్రొద్దుటి పండుగలయితే, శ్రీరామనవమి కచ్చితంగా మిట్టమధ్యాహ్నపు పండుగ. ఇక దీపావళి అనేది సాయంకాలంనుండి ప్రారంభమయ్యే రాత్రి పండుగ కాగా, మహాశివరాత్రి సరిగా అర్ధరాత్రి నుండి ప్రారంభమయ్యే తెలవారుజాము పండుగ.

ఇంతే కాదు. ఈ పండుగలలో విజయదశమి వంటి కొన్ని తమ గెలుపుని చెప్పేవి కాగా, శ్రీకృష్ణాష్టమి వంటి కొన్ని పుట్టిన రోజుకి సంబంధించినవి. అలాగే భీష్మాష్టమి వంటి కొన్ని ప్రసిద్ధ పురుషుని నిర్యాణానికి గుర్తుగా ఉండేవి కాగా, సంక్రాంతి వంటి కొన్ని సూర్యుని సంచారానికి సంబంధించినవి.

ఇలా అనేక విధాలుగా ఉన్న మన పండుగలు అన్నీ కూడా, ఒక్కొక్కటీ ఒక్కొక్క ప్రసిద్ధమైన ఘట్టాన్ని గుర్తుచేసుకునేందుకు సంకేతాలుగానే కన్పిస్తాయన్నమాట. ఇలాటి పండుగల్లో వినాయక చవితిని (గణేశ చతుర్థి) గురించి మనం తెలుసుకోబోతున్నాం.

ఈ పై వివరణాన్ని బట్టి ఇది వినాయకుని జన్మదినపు పండుగ అనీ, పైగా పగలు చేసుకునే పండుగ అనీ, తొమ్మిది రోజులపాటు ఉత్సవాలు సాగినా ఒకే ఒక్క రోజు ప్రధానంగా కలిగిన పండుగ అనీ తేలింది. ప్రతి దేవునికీ పేరూ - రూపం ఎలా ఉంటాయో అలాగే ఈ దేవునిక్కూడా నామమూ - రూపమూ ఉన్నాయి. అయితే అందరు దేవతల కంటె చిత్రమైన నామ - రూపాలు ఈయనవి. పరిశీలిద్దాం.

**ఓమ్ అని పలికితే ఆయనని పలకరించినట్లే!**
**ఓం అని వ్రాస్తే వినాయక చిత్రాన్ని గీసినట్టే!!**

అసలు సృష్టి ప్రారంభంలో 'నాదం' (ఒక ధ్వని) పుట్టింది. ఆ నాదం నుండి అచ్చులూ హల్లులూ పుట్టాయి. ఆ అక్షరాలతో వేదం ఏర్పడింది. ఆ వేదాల నుండి ఓంకారం పుట్టింది. ఆ ఓంకారమే వినాయకుడు. వేదాలని 'గణానాం త్వా గణపతిగ్ం హవామహే...' అని నేర్చుకోవడం (చెప్పుకోవడం అనాలి) ప్రారంభించినప్పుడూ, సంగీతాన్ని 'శ్రీ గణనాథ సిందూరవన్న....' అని నేర్చుకోవడం ప్రారంభించినప్పుడూ, సాహిత్య శాస్త్రాన్ని 'రామః - రామౌ - రామాః.....' అని నేర్చుకోవడం ప్రారంభించినప్పుడూ, ... ఇలా ఏ శాస్త్రాన్ని నేర్చుకోవడం ప్రారంభించినప్పుడైనా వినాయక స్తుతి చేయాలనేది సంప్రదాయంగా వస్తోంది. దేవునికి అష్టోత్తర - లేదా - సహస్ర నామాలని చదవబోయేప్పుడు కూడా ప్రతి నామం ముందూ వినాయక ధ్యానం చేసామని చెప్పేందుకు సంకేతంగా 'ఓమ్' అని అనడం సంప్రదాయంగానే వస్తోంది. 'ఓమ్' అనడం సామాన్యమైన విషయమా?

ఏ పూజని ప్రారంభం చేయదలచినా ముందుగా ముమ్మారు ఓంకారాన్ని ఉచ్చరించాలి. ఏదో మొక్కుబడిగా కాక 'ఓం' అనే అక్షరాన్ని పలుకగలిగినంత సేపు పలుకుతూ, తిరిగి శ్వాసపీల్చకుండా అదే శ్వాసలో 'మ్' అనే అక్షరాన్ని కూడా ఉచ్చరించాలి. ఓ.......మ్ - అని ఈ తీరుగా ఉచ్చరించాలన్నమాట.

1. వేదాలలో మొదటిది ఋగ్వేదం. దీనిలోని మొదటి ఋక్కు (మంత్రం) **'అగ్నిమీళే పురోహితమ్'** అనేది. దీనిలోని మొదటి వర్ణాన్ని **'అ'** అనే అక్షరాన్ని ఒకచోటికి తెచ్చారు. వేదాలలో రెండవది యజుర్వేదం. దీనిలో ఉన్న మొత్తం మంత్రాలలో సరిగా మధ్య మంత్రం (ఈ వేదంలో ఉన్న మంత్రాల సంఖ్య 9 అనుకుంటే 5వదన్నమాట) **'యో విప్రముద్రో బంధుః'** అనేది. మళ్లీ ఈ మంత్రంలో ఉన్న ఏడు అక్షరాల్లోనూ మధ్య అక్షరం 'ము' కదా. దానిలోని **'ఉ'** అనే అక్షరాన్ని కూడా ఒకచోటికి తెచ్చారు. వేదాలలో చివరిది సామవేదం. ఆ చివరి వేదంలోని చివరి మంత్రం **'అవమావాంతరమ్'** అనేది. దీనిలో ఉన్న చివరి వర్ణాన్ని **'మ్'** అనే అక్షరాన్ని కూడా ఒక చోటికి తెచ్చారు.

ఒక వస్తువుని ముమ్మారు కోస్తే 4 ముక్కలవుతాయి గదా! వేదాన్ని మూడుగా విభజించగా ఇక్కడ 4 అయ్యాయి. ఆ నాలుగవదే అథర్వ(ణ)వేదం. ఆ వేదంలోని ఉచ్చరించడాన్ని వేర్వే విధానమైన 'స్వరాన్ని' కూడా ఒక చోటికి తెచ్చారు.

ఇప్పుడు ఆ ఋగ్వేదపు **అ** కారానికి, ఈ యజుర్వేదపు **'ఉ'** కారాన్నీ ఆ సామవేదపు **'మ్'** కారాన్నీ కలిపి, ఈ మూటి మిశ్రమానికీ అథర్వ(ణ)వేదపు స్వరాన్ని చేర్చి **'ఓ.......మ్'** అని సిద్ధం చేసారు. అ + ఉ + మ్ = ఓమ్ అయ్యిందన్నమాట.

రంగురంగుల పూలని రాలుస్తూ అటూ ఇటూ చెట్లూ - ఆ చెట్ల వరుసల మధ్యగా ఎక్కడికో వెడుతూన్న ఒక మార్గం....ఇలా నేర్పరి అయిన చిత్రకారుడు బొమ్మగా గీసాడనుకుందాం. ఆ చిత్రాన్ని చూస్తూన్న మనం, ఆ మార్గం మీద నడుస్తూ ఆ పూలు మనమీద పడుతూన్న భావనని పొందుతూ, చిత్రం చాల బావుందని అంటున్నామా? లేదా?

అక్కడ ఎలా భావన ప్రధానంగా ఉందో, ఇక్కడా అలాగే ఈ ఓ....మ్‌ని పలికేటప్పుడు కూడా - "4 వేదాలనీ నేర్చుకుని ఈ జీవితంలో సస్వరంగా పలికే అదృష్టాన్ని పొందలేని నేను, ఈ ఓ.....మ్ అనే - మంత్రంతో సమానమైన అక్షరాన్ని

- ఉచ్చరిస్తూ 4 వేదాలనీ పలికిన అదృష్టానికి నోచుకుంటున్నాను గదా! ఎంత అదృష్టవంతుణ్ణి!" అని భావించాలి. భావన అనేది లేనినాడు భౌతికంగా తాను రెండు కాళ్ల ప్రాణే అయినా నాలుక్కాళ్ల ప్రాణి అవుతాడని శాస్త్రం చెప్తోంది. కాబట్టి భావన ప్రధానం.

2. ఓంకారం నాలుగు వేదాల సారమే కాదు. ఓంకారం వినాయకుని రూపం కూడాను. ఈ 'ఓమ్' అనే వర్ణాన్ని సంస్కృత భాషా లిపిలో 'ओम्' అని వ్రాయాలి. కాని అలా ఎక్కడా వ్రాయకుండా పండితులయినవారు కూడా ॐ అనే వ్రాస్తారు. విశేషాన్ని తెలుసుకోవాలి.

ॐ అనే ఈ రూపంలో '3' లా కన్పించే భాగం ఉంది. ఆ 3 అనే అంకెకూడా అడ్డంగా రెండుగా విభజించబడినట్లు కన్పిస్తోంది. ఆ విభాగం కూడా సరిసమానంగా కాదు. పై భాగం చిన్నగానూ, క్రింది భాగం పెద్దగానూ కన్పిస్తోంది. జాగ్రత్తగా పరిశీలించాలి. చిన్నగా కన్పించే ఆ పై భాగం వినాయకుని శిరస్సు. క్రిందగా కన్పించే పెద్దభాగం ఆయన బొజ్జ.

ఆ శిరస్సూ ఈ బొజ్జా కలిసిన భాగం నుండి - చూస్తూన్న మనకి కుడివైపుగానూ, ఆ దేవునికి మాత్రం ఎడమవైపుగానూ - ప్రక్కగానూ వెడుతూ వంకరగా కన్పించే ఆ భాగం ఆయన తుండం. 'వినాయకుని తుండం ఎటువైపు తిరిగి ఉంటుంది? ఉండాలి?' అనేది, ఈ విషయం తెలియనప్పుడు ఒక పెద్ద చర్చనీయాంశమే కదా!

ఇక ॐ కారంలో మిగిలింది తల మీద ఉన్న అర్ధ చంద్రాకారపు భాగం. అది ఆయన శిరస్సుమీద ఉండే 'చంద్రవంక'. అందుకే 'నుదుటిపై చంద్ర రేఖ కలవాడు' అనే అర్థం వచ్చే 'ఫాలచంద్రః' అనేది కూడా వినాయకునికి ఒకపేరు.

3. విద్యలన్నింటికీ మూలమైనది వేదవిద్య. అందుకే వేదాన్ని శ్రవణ సుఖావహంగా (చెవి కింపుగా) విన్పించదలచిన పండితులు 'శ్రీ మహాగణాధిపతయే నమః - శ్రీ గురుభ్యో నమః - హరిః ఓమ్ - అని పలికి ఆ మీదటే వేదాన్ని విన్పిస్తారు. అందుచేత ఓ. . .మ్ అని పలుకుతూ చతుర్వేదాలకీ అధినేత అయిన వినాయకుణ్ణి ధ్యానించి, వినాయక రూపాన్ని ॐ అని వ్రాస్తూ చిత్రిస్తామన్నమాట. సామాన్యమైన ఉత్తరాన్ని వ్రాయబోయే ముందుకూడా ॐ అని ముందుగా రాయడం వినాయకారాధనం

కోసమే అన్న మాట. ఈ కారాన్ని రాయడం ఇప్పటివఱకూ మనకి అలవాటులో లేకుంటే ఇప్పటినుండైనా అలవాటు చేసుకోవడంలో తప్పేమిటి? ఇంతేకాదు. పండితులు అఱచేతిలో విభూతి వేసుకుని నీటితో తడిపి మధ్యవేలితో ఈ కారాన్ని రాస్తూ ఆ విభూతిని నుదుటికి (త్ర్యంబక మంత్రాన్ని పఠిస్తూ) పెట్టుకుంటారు.

4. భగవంతుడిలో లీనం కావడాన్ని మోక్షం అంటారు. లీనం కావడమంటే రెండు వేర్వేఱు వస్తువులు పాలూ నీరూ లాగా ఒకటిగా అయిపోవడమన్నమాట. 'సోహమ్' అని అంటూంటారు. సః = ఆభగవంతుణ్ణి, అహమ్ = నేనే - అని దీని అర్థం. అంటే పరమాత్మకీ తనకీ భేదమే లేదనేంత తాదాత్మ్య స్థితికి వెళ్లిపోవడమన్నమాట. దీనినే 'అద్వైత సిద్ధి' అంటారు. జీవాత్మా పరమాత్మా అనే రెండూ వేఱువేఱుగా లేవనీ రెండూ ఒకటిగానే ఉన్నతనాన్ని పొందడమనీ ఈమాటకి అర్థం.

అలాటి సోహమ్‌లోని సకార హకారాలని తొలగిస్తే ఓ అమ్ = ఓ మ్ = పూర్వ రూపసంధి చేస్తే (శివో అహమ్ = శివోహమ్‌లో లాగా) ఓమ్ అవుతుంది. అంటే 'నేనే ఆ పరమాత్మను' అనేంత ఏకాగ్రచిత్తం ఈ కారంద్వారా సాధింపబడుతుందని గ్రహించాలన్న మాట. ఏర్పడాలన్నా దానికి మూలమైన మంత్రం వంటి అక్షరం 'ఓమ్' అని గుర్తించాలన్నమాట.

5. పైవన్నీ ఆధ్యాత్మికాలోచనలయితే భౌతికాలోచనం (శరీర ప్రయోజనం) కూడ ఒకటుంది. పరిశీలిద్దాం. ఒక గడియారం ఉందనుకుందాం. అది పనిచేసే కాలం రెండేళ్లు మాత్రమే అనుకుందాం. దాన్ని ఒక సంవత్సరం పని చేయకుండా ఉంచామనుకుందాం కూడా. అప్పుడు అది పనిచేసే కాలం ఆ వస్తువు కొన్నప్పటినుండి మూడు ఏండ్లయింది గదా!

అలాగే వ్యక్తి ఆయుష్యకాలం న్యాయ్యంగా నూఱు సంవత్సరాలు. జీవించడమనే దానికి సాక్ష్యం 'ప్రాణం ఉండడం (ప్రాణం అంటే గాలి)' అంటే ఉచ్ఛ్వాస నిశ్వాసలని చేస్తూండడం. ఆరోగ్యవంతుడైన ప్రతి వ్యక్తీ ప్రతిదినానికీ 21,600 మాఱులు (ప్రతి 4 సెకనులకీ ఒక మాఱు) ఉచ్ఛ్వాస నిశ్వాసాలని చేస్తాడు. అలా 21,600 × 363 రోజులు × 100 సంవత్సరాలు అతని ఆయుష్యకాలమన్నమాట.

కాగా గాలిని పీల్చి బంధించి 21600 ఉచ్ఛ్వాసనిశ్వాసలని కాకుండా 21000 మాత్రమే ఖర్చు చేసికోగలిగినట్లయితే ఈ రోజు ఈ చేసిన 'బంధనం' వలన 600

ఉచ్ఛ్వాస నిశ్వాసలని మనం పొదుపు చేసుకున్నట్టే. అంటే 4 సెకన్ల ఆయుర్దాయాన్ని పెంచుకున్నట్టే కదా! దీన్నే 'ప్రాణాయామం' అంది శాస్త్రం. ఇలా రోజుకి 600 ఉచ్ఛ్వాస నిశ్వాసల బంధనం చేస్తే దానివలన సంవత్సరానికి 10 రోజుల ఆయుర్దాయాన్ని పెంచుకోవచ్చు. మరికొంత ప్రాణాయామాన్ని చేస్తే మరింత ఆయుష్యాన్ని పెంచుకోవచ్చు.

ఇదంతా ఎందుకంటే ఓ...మ్ అనే ఈ మంత్రాక్షరాన్ని పలుకుతూ ఎంతసేపు గాలిని బిగబట్టాడో - బిగబట్టగలిగాడో గమనించుకుని - ప్రతీవ్యక్తీ తన ఆరోగ్య పరిస్థితిని తానే ఒక వైద్యునిగా ప్రతిదినమూ పరీక్షించుకోవచ్చునని చెప్పడం కోసమే. ఆరోగ్యవంతుడైన వ్యక్తి ఓంకారాన్ని 30 సెకన్లపాటూ, మధ్యమారోగ్యం కల వ్యక్తి 20 సెకన్లపాటూ, ఇక అనారోగ్యపరుడూ - అనారోగ్యం (ముఖ్యంగా శ్వాసకోశం) రాబోయే వ్యక్తీ 20 సెకన్లలోపూ ఉచ్చరించగలరుట.

యోగ వ్యాయామంలో 3 దశలుంటాయి. మొదటి దశలో గాలిని ఒక ముక్కు రంధ్రంతో పూర్తిగా పీల్చడం, రెండవ దశ బిగబట్టిఉంచడం, 3వ దశలో విడిచి వేయడం అనేవే ఈ మూడు దశలూను. అయితే ఓంకారం ద్వారా గాలిని క్రమబద్ధంగా విడవడం అనేది అభ్యాసమౌతుంది. దీనివలన శ్వాసకోశం బలపడుతుంది.

ఈ అభ్యాసానికి 'ఓం' అనే అనాలా? మాకెంతో ఇష్టమైన 'ఛీ' అనే అక్షరాన్ని మేం అనుకోవచ్చుగదా! అని కొందరు క్రొత్తకాలపు మేధావులు ప్రశ్నించవచ్చు. వారి దృష్టిలో పవిత్రమైన వర్ణం ఛీ అనేదే కావచ్చు. చాల సంతోషం. కాని అలా కుదరదు.

ఎందుకంటే వర్ణాలు ఉచ్చరించే స్థానాల్లో మొదటిది కంఠం. అందులో నుండి పుట్టిన వర్ణమైన - అ - ఓంకారంలోని మొదటి వర్ణం. వర్ణం ఉచ్చరించే స్థానాల్లో చివరివి పెదవులు. వాటిలో పుట్టే - మ - ఓంకారంలోని చివరి వర్ణం. కాబట్టి ఓంకారాన్ని నియమబద్ధంగా ఉచ్చరిస్తే ఉచ్చారణావయవాలన్నింటికీ తగిన వ్యాయామాన్ని కల్గించినట్లే అర్థమన్నమాట.

ఇన్ని విశేషాలతో నిండిన ఓంకారాన్ని పూజా ప్రారంభంలో, ఉచ్చరించామన్నమాట. ఇక్కడ రాసిన భావాన్ని చదువుతూంటే, కొత్తగా ఉండీ, ఎక్కువగా, అనిపించీ 'ఇంత గుర్తుంటుందా?' అన్పించ వచ్చుగాని నిత్యనియమంగా

ఓంకారాన్ని ఉచ్చరించడం ప్రాతఃకాలంలోనే అలవాటుగా చేసుకుంటే, ఈ భావం అలా మనసులో నిలిచిపోతుంది - పూజా సార్థకం ఔతుంది.

కాబట్టి పూజా ప్రారంభంలో ఓ.....మ్ అంటూ నాలుగు వేదాలనీ మనసులో పలికాం. వినాయక చిత్రాన్ని మనసులోనే గీసుకున్నాం అన్నమాట. ఇప్పుడు ఇక వినాయకుణ్ణి గూర్చిన ధ్యాన శ్లోకాలు చదువుకోబోతున్నాం.

## వి(ఘ్న)నాయకునికే విఘ్నమా?

ఔను. విఘ్నం వచ్చిపడింది. అది కూడా ఎప్పుడో ఎక్కడో కాదు. ప్రారంభంలో చేసే ప్రార్థన శ్లోకం లోనే. వివరంగా చూద్దాం.

**శు క్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।**

**ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవి ఘ్నోపశాంతయే ॥**

అతిసామాన్యమైన నోము దగ్గఱ నుండి అశ్వమేధయాగం వఱకూ ప్రారంభకాలంలో ప్రార్థన శ్లోకంగా పామరుడి దగ్గఱనుండి వేదవేత్త వఱకూ దీన్ని చదవనివారుండరు. ఎవరు చదివినా ఎప్పుడు చదివినా వినాయకుని ముందే దీన్ని చదువుతారనేది నిశ్చయం కదా! ఇక వివరంగా అర్థాన్ని చూసి, ఈ శ్లోకానికి సంబంధించిన చిరునామాదారు వినాయకుడు ఔనో కాదో ఆలోచిద్దాం !

ముందుగా పై అర్థాన్ని చూద్దాం.

శుక్ల + అంబరధరమ్ = తెల్లని వస్త్రాలని ధరించినవాడూ,

శశివర్ణమ్ = చంద్రునిలా తెల్లనైన రంగు శరీరంవాడూ,

చతుర్భుజమ్ = నాలుగు చేతులతో ఉండేవాడూ,

ప్రసన్న వదనమ్ = అనుగ్రహ దృష్టితోచూచే ముఖం కలవాడూ,

విష్ణుమ్ = అయిన విష్ణువును,

సర్వ విఘ్న + ఉపశాంతయే = అన్ని విఘ్నాలూ శాంతిని పొందడం కోసం,

ధ్యాయేత్ = మనసుతో ధ్యానించవలసి ఉంది కాబట్టి, నేనూ అదే ఉద్దేశ్యంతో ధ్యానిస్తున్నానని దీని అర్థం.

ఈ శ్లోకంలో 'విఘ్నమ్' అనే మాట (విశేష్యం) ఈ శ్లోకం వినాయకునిది కాదనీ - విష్ణువుకి సంబంధించిన ప్రార్థనశ్లోకమేననీ - తేల్చి చేప్పేస్తోంది.

పోనీ పొరపాటయిందనుకొని ఈ శ్లోకాన్ని విష్ణువు వద్ద చదివితే, ఆయనా ఆ శ్లోకం తనది కాదంటాడు. ఎందుకని?

'తెల్లని వస్త్రాలని కట్టిన ఓ శ్రీహరీ!' అనగానే ఆయన తన ఒళ్లంతా చూసుకుంటాడు. కారణం 'పచ్చని పట్టు బట్టలు తప్ప వేఱు రంగు వస్త్రాలని ఆయన కట్టడు కాబట్టి' (పీతాంబరుడు గదా మఱి!)

'చంద్రునిలా తెల్లనైన శ్రీ విష్ణూ!' అనగానే పకాలున లక్ష్మీదేవి నవ్వనే నవ్వుతుంది. కారణం ఆయన 'నీలమేఘశ్యాముడు' కాబట్టి.

'విఘ్నాలు శాంతించేందుకు నిన్ను ప్రార్థిస్తున్నాను' అని శ్లోకంతో (లో) అనగానే విష్ణువే మందహాసం చేస్తాడు. కారణం - 'సృష్టి స్థితి లయాలలో స్థితి (పుట్టిన వాళ్లని పోషించడం వఱకే) మాత్రమే తన పని కాగా ఈ విఘ్నాల విషయం తనకి తెలియదు కాబట్టి. ఇలా ఈ శ్లోకం ఇటు వినాయకునిదీ కాక - అటు విష్ణువుదీ కాకపోవడం వలన వినాయకునికే విఘ్నం వచ్చిందనుకున్నాం. కాని ఈ ఆలోచన సరికాదుట.

'శుక్ల + అంబరధరమ్' అంటే 'తెల్లనైన ఆకాశాన్ని ధరించేవాడు' అని అర్థం. 'భూమి' శ్రీ మహావిష్ణువుకి పాదాలు కాగా (భూః పాదౌ), 'ఆకాశం' ఆయనకి బొడ్డు (యస్య నాభి ర్ద్వియత్) అని విష్ణు సహస్రనామం చెప్తోంది. ఆ బొడ్డు నుండి - బ్రహ్మ - అంటే సృష్టికర్త పుట్టి ప్రాణి సృష్టి చేసాడని మనకి తెలుసు. కాబట్టి సర్వానికీ మూలం ఆకాశం.

అందుకే 'ఆకాశా ద్వాయుః - వాయో రగ్నిః - అగ్నే రాపః - అబ్భ్యః పృథివీ - పృథివ్యా ఓషధయః - ఓషధీభ్యో న్నమ్ - అన్నా ద్భవంతి భూతాని' అంది వేదం. ఆకాశం నుండి వాయువూ - దాని నుండి అగ్నీ - అగ్ని నుండి నీరూ - నీటినుండి భూమీ - భూమి నుండి ఓషధులూ - ఓషధుల నుండి అన్నమూ - అన్నం వలన ప్రాణులూ కలుగుతారని శాస్త్రం చెప్పింది. అలా 'ప్రపంచానికి సర్వాధారమైన ఆకాశాన్ని ధరించినవాడు' అంటే సృష్టిని సర్వాన్నీ తన అధీనంలో ఉంచుకునేవాడు అని ఈ **'శుక్లాంబరధరమ్' అనే మాటకి అర్థం. ఈ లక్షణాలు కలవాడెవరో చివర్లో చూద్దాం.**

ఇక 'శశివర్ణమ్' అనే చోట కూడా విశేషం ఉంది. శశమంటే కుందేలు. ఆ శశ లక్షణాలు కలవాడు 'శశి' (చంద్రుడు). కుందేలు ఎలా నేల మీద ఒక అడుగువేసి మళ్లీ గంతువేసి కొంత దూరంలో ఒక క్షణం నిలిచి మళ్లీదూకుతూ పోతూ ...... అలా ఒకే తీరు నడక లేకుండా ఉంటుందో, అలాగే ఈ చంద్రుడు కూడా - శుక్లపక్షం 15 రోజులూ వెన్నెలతో సాక్షాత్కరించి సంతోషపెట్టి, కృష్ణపక్షంలో చీకటిని నింపి దర్శనాన్నే ఈయక - ఆ కుందేలులానే ఒకే తీరు నడక లేకుండా ఉంటాడు. అందుకే ఈయన్ని కుందేలుతో పోల్చారు.

ఇలాటి ఈ చంద్రుణ్ణి బట్టే మనం కాలాన్ని కొలుస్తాం. స్వస్తి. శ్రీ చాంద్రమాన అని రాసేది ఇందుకే. 'చాంద్రమాన' అంటే చంద్రుని నడకని బట్టి ఏర్పడిన కాలపు కొలతలో 'ఈ రోజు ఫలానిసంవత్సరపు ఫలాని నెలలో, ఫలాని పక్షంలోని, ఫలాని తిథికల, ఫలాని వారంపేరిటి, ఫలాని నక్షత్రంకల రోజు' అని చెప్పడమన్నమాట. శుక్లపక్షంతోనే కదా క్రొత్త నెల ప్రారంభమౌతుంది. అలా కాలాన్ని కొలిచే చంద్రుని లక్షణం ఉన్నవాడూ - కాలాన్ని తన అధీనంలో ఉంచుకొనేవాడూ అని 'శశి వర్ణమ్' అనే మాటకి అర్థం. ఈ లక్షణాలు కలవాడెవరో చివర్లో చూద్దాం.

చతుర్భుజమ్ అంటే నాలుగు చేతులు కలవాడు అని అర్థం. రోజులూ- 15 రోజులతో ఏర్పడే పక్షాలూ (శుక్ల - కృష్ణ పక్షాలు) - 2 పక్షాలతో ఏర్పడే మాసాలూ- 12 మాసాలతో ఏర్పడే సంవత్సరాలూ - అనే ఈ నాల్గింటినీ తన నాలుగు చేతులుగానూ కలిగినవాడు అని అర్థం. **ఈ లక్షణాలు కలవాడెవరో చివర్లో చూద్దాం.**

**విష్ణుమ్ - అన్నింటిలోనూ వ్యాపించి ఉండే లక్షణం కలవాడు అని అర్థం.**

**'ఇందుఁ గలఁ డందు లేఁ డను సందేహము వలదు - చక్రి సర్వోపగతుం**

**డెందెందు వెదకి చూచిన - నందందే గలఁడు దానవోత్తమ వింటే!'**

**అని అలవాడు ప్రహ్లాదు డన్నాడంటే దాని అర్థమిదే. పాములో పాము ఆకారంతోనూ, ఏనుగులో ఏనుగు ఆకారంతోనూ ఇలా .... ఏ వ్యక్తిలో ఆ వ్యక్తి ఆకారంతో అలా వ్యాపించి ఉంటూండేవాడని 'విష్ణుమ్' అనే మాటకి అర్థం. ఈ లక్షణాలు కలవాడెవరో చివర్లో చూద్దాం.**

ఇంత వఱకూ ఈ శ్లోకం విష్ణువుకీ, వినాయకునికీ కూడా సరిపోతుంది. అయితే 'ప్రసన్నవదనమ్' 'సర్వవిఘ్నోపశాంతయే' అనే రెండు మాటలదగ్గిరా ఈ శ్లోకం స్పష్టంగా వినాయకునిదే అని తేలిపోతుంది. కారణం 'ప్రసన్నవదనమ్' అనే మాటకి గజశ్రేష్ఠమైన ఏనుగు ముఖమే తన ముఖంగా కలిగినవాడు అనే అర్థాన్ని నిఘంటువు చెప్పిఉండడమే. (ప్రసన్నో గజయూథపః) అలాగే 'సర్వవిఘ్నోపశాంతయే' అనే మాటకి 'అన్ని విఘ్నాలనీ తొలగించే శక్తి కలవానికి' అనే అర్థం ఉండడం, ఆ శక్తి కూడా సకల గణాలకీ అధిపతిగా దేవతలందఱి చేతా ఎన్నుకోబడిన వినాయకునికే ఉండడం వల్ల ఈ శ్లోకం వినాయకునికి సంబంధించిందే అని స్పష్టంగా తెలిసిపోతోంది.

అయితే ఈ శ్లోకాన్ని విష్ణువుకి కూడా సమన్వయించవచ్చు. సకల సృష్టికీ ఆధారమైన వాడూ - చంద్రుడూ సూర్యుడూ అనే ఇద్దఱూ తన రెండు కళ్లూ కాబట్టి, కాలాన్ని తన అధీనంలో ఉంచుకొన్నవాడూ - నాలుగు చేతులున్న వాడూ - అంతటా వ్యాపించి ఉన్నవాడూ అయిన విష్ణువుని ధ్యానిస్తూ ఉన్నాననే అర్థాన్నీ చెప్పవచ్చు. అప్పుడు ప్రసన్న వదనమ్ - అనే మాటకి 'అనుగ్రహించే ముఖం కలవాడు' అని అర్థాన్ని చెప్పుకోవాల్సి ఉంటుంది. మఱి ఈ శ్లోకం విష్ణువుకి సంబంధించిన ప్రార్థన శ్లోకంగా సమన్వయించుకుంటూ, ఇలా అర్థం చెప్పుకున్నప్పుడు 'వినాయకుని ముందు చదవచ్చా?' అనకోరాదు. వినాయకుడు విష్ణుస్వరూపుడే కనుక నిర్భయంగా చదువుకోవచ్చు.

## వినాయకు డెవరో కాదు. విష్ణువే!

భార్యాభర్తలు కలిసి ఉన్న చిత్రాన్ని సహజంగా చూస్తూ ఉంటాం. లక్ష్మీదేవి శ్రీమహావిష్ణువు భార్య అని మనకి తెలుసు. వినాయకుడు విష్ణువే కాకపోతే లక్ష్మీగణపతి విగ్రహాన్ని చూడనే చూడలేం కదా! ఆ లక్ష్మీగణపతి విగ్రహం ఎందఱి ఇళ్లలోనో ఆరాధింపబడుతోందంటే అలాటి విగ్రహం ఉండడం దోషం కాదన్నమాటేకదా !

ఇక శ్రీమహా విష్ణువుకి నారాయణుడనే పేరు కూడా ఉంది కదా! నార + అయనుడు - నీళ్లే స్థానంగా కలిగినవాడు - అని దీని భావం. అందుకే వినాయక పూజ మొత్తం అయ్యాక వినాయకుణ్ణి, అంటే ఆ విష్ణువుని ఆయనకు తన సొంత ఇల్లైన నీళ్లలోనే నిమజ్జనం చేస్తున్నాం.

ప్రతి దేవాలయానికీ క్షేత్రస్వామీ (ఆలయంలో ఉండే మూల విరాట్టూ) - క్షేత్రాన్ని రక్షిస్తూ ఉండే క్షేత్రపాలకుడూ - అని ఇద్దరు తప్పక ఉంటారు.

ప్రసిద్ధక్షేత్రాల విషయంలో శివుడు క్షేత్రస్వామి అయితే క్షేత్రపాలకుడుగా విష్ణువుండాలి. అలాగే విష్ణువు క్షేత్రస్వామి అయితే శివుడు క్షేత్రపాలకుడుగా ఉండాల్సిందే. అందుకే ప్రసిద్ధ శైవక్షేత్రమైన శ్రీశైలంలో క్షేత్రస్వామి మల్లికార్జునుడనే పేరుగల శివుడు అయితే, క్షేత్రపాలకుడుగా శ్రీశైలానికి వెడుతూంటే ప్రారంభంలో వినాయకుడు (విష్ణురూపుడు కాబట్టి) దర్శనమిస్తాడు. అలాగే ప్రసిద్ధ వైష్ణవ క్షేత్రమైన తిరుమలలో క్షేత్రస్వామి వేంకటేశ్వరుడనే పేరుగల విష్ణువు అయితే, క్షేత్రపాలకుడుగా మల్లికేశ్వరుడనే పేరుగల కొండమల్లన్న ఉంటాడు. అయితే ఈయనకు గుర్తింపు లేదు. చాల మందికి కొండ మల్లన్న సంగతి తెలియదు కూడ.

పశ్చిమ గోదావరి జిల్లాలో 'చిన్న తిరుపతి' అని పిలువబడే ప్రసిద్ధ వైష్ణవ క్షేత్రమైన ద్వారకా తిరుమలలో క్షేత్రస్వామి వేంకటేశ్వరుడుకాగా, కొండమీద క్షేత్రపాలకుడుగా శివునికి నేడు కూడా ఆరాధన జరుగుతూ ఉండడం కన్పిస్తుంది. గణపత్యథర్వ శీర్షోపనిషత్తు కూడా వినాయకుణ్ణి గూర్చి చెప్తూ - నువ్వే విష్ణువువి (విష్ణుస్త్వమ్) అనీ, ప్రాణులని రక్షించి రక్షించేవాడివీ (స్థితి) నువ్వేననీ (ధర్తాసి) - తెలిపింది.

## తుండము నేకదంతమును......
## పద్యానికి ఇంత అర్థం ఉందా ?

**తుండము నేకదంతమును తోరపు బొజ్జయు వామహస్తమున్**
**మెండుగ మ్రోయు గజ్జెలును మెల్లని చూపులు మందహాసమున్**
**కొండొక గుజ్జురూపమును కోరిన విద్యల కెల్ల నొజ్జయై**
**యుండెడి పార్వతీతనయ! యోయి గణాధిప! నీకు మ్రొక్కెదన్.**

ఎక్కడిదో, ఎవరిదో కాని చాల చక్కని అర్థం ఉన్న పద్యం ఇది. అందరు తల్లులకీ లాగానే పార్వతీ దేవికి కూడా తన పిల్లవాడైన వినాయకుడు, దేనిలో గొప్పవాడో ఒక్కసారి చూచి మురిసిపోవాలని అన్పించి చూచిందట పరిశీలనగా. ముందుగా ఎవరైనా చూచేది ముఖాన్నే కదా! ఒక తుండం - ఒకే దంతం - పెద్ద బొజ్జ - పొట్టి చేయీ కన్పించింది. ఎన్నో ఉండ్రాళ్లు తినే లక్షణం ఉన్నవాడు కాబట్టి, భోజన విషయంలో గొప్పవాడుగా చేద్దామనుకొంది ఆమె. కానీ అంతలోనే ఆమెకు నిరాశ కల్గింది. ముఖంగా తినేందుకు నోటికి అడ్డుగా - తుండము - తుండం ఒకటి వచ్చిపడింది.

పోనీ తుండం ఏదో అడ్డుగా ఉన్నా, తొందర తొందరగా నమిలి తింటాడనుకొనే వీలు లేకుండా ఈ తుండానికి తోడుగా - **ఏక దంతమును** - ఒకే ఒక్క దంతం. ఈ ఒక్క దంతంతో - ఆ తుండంతో తన పిల్లవాడు ఏదో నెమ్మదిగా ఏ కాస్తో తింటే చాలదా? - అనుకోడానికి వీలులేకుండా - **తోరపు బొజ్జ** - పెద్ద గాదెతో సమానమైనంతటి బొజ్జ కన్పించింది ఆమెకి.

దీన్ని రోజూ నింపకపోతే కుదరదు గదా! నమలకపోతే మ్రింగివేస్తాడు - అయినా తుండం అడ్డుగా ఉంటే మాత్రం ఇబ్బందేముంది ? తుండాన్ని వాడనే వాడక, తన చేతితోనే నోటికి ఆహారాన్ని అందిచ్చే ఏర్పాటుని చేసుకుంటాడు గదా! అనుకుంది కాని ఆ చేయికూడా - **వామహస్తము** - పొట్టి చేయి అయింది. అంటే ఈ చేయి, ఆ నోటివఱకూ వెళ్లేంత పొడుగు కూడా లేదన్నమాట. ఇదంతా గమనించిన పార్వతి తన పుత్రుడు 'భోజనప్రియులలోనైనా ఉత్తముడు' కాలేడని భావిస్తూ తన అభిప్రాయాన్ని మార్చుకుంది.

పోనీ! వినాయకునికి అతని తండ్రిలా మంచి నృత్య విధానం వచ్చిందేమో! అని పరిశీలించింది. మళ్లీ నిరాశురాలయింది. **మెండుగ మ్రోయు గజ్జెలును**- మ్రోగుతూన్న తన కాళ్ల గజ్జెలకి అనుగుణంగా చురుకుగా చూడ గలిగే చూపులూ, అందఱినీ ఆకర్షించే విధంగా చక్కని నవ్వూ నర్తకునికి ఉండాలి. వినాయకునివి పొట్టి కాళ్లు అయిన కారణంగా కాలి గజ్జెలు మాత్రం శీఘ్రంగా ధ్వనిస్తూ ఉంటాయి. అయితే ఆ ధ్వనికి అనుగుణంగా చూచే నేర్పు మాత్రం లేక - **మెల్లని చూపులు** - విదానంగా చూసే చూపులూ (కాస్త ఆలోచిస్తే బద్ధకంగా) - చక్కని ఆకర్షణీయమైన నవ్వు కాకుండా- **మందహాసమున్** - మందుని యొక్క హాసం అంటే - అజ్ఞాని నవ్విన వెఱ్ఱినవ్వు వానిలో కన్పించింది. అంతే! ఆమెకి మఱింత బాధా కోపమూ ఒకేసారి వచ్చాయి.

ఏ విద్యా రాకపోయినా ఊరికే అలా చూస్తే అందంగా ఉండే రూపసి లక్షణం గాని ఉందా? అని ఆలోచించి చూసింది. **కొండొక గుజ్జురూపమును** - అదోతీరు మఱుగుజ్జు రూపం కన్పించింది వినాయకునిలో. ఇక తట్టుకోలేకపోయింది దుఃఖానికి. తన పుత్రుడు అందంగా గాని, ఏ విషయంలోనైనా గాని ప్రసిద్ధుడూ, సమర్థుడూగా గాని లేవేలేడనే విషయం అర్థమైన ఆమెలో ప్రతీకార దృష్టి పెరిగింది.

ఇలా పరిహాసం చేయదగిన విధంగా ఉన్న తన పుత్రుణ్ణి ఏం చేసి(స్తే) లోకమంతా కూడా అతణ్ణి గౌరవించి పూజించేలా చేయగలనా? అని ఆలోచించింది. వెంటనే ఆమెకు తోచింది - **'కోరిన విద్యల కెల్ల ఒజ్జ'** - ఎవరు ఏ చదువుకావాలని కోరుకుంటారో ఆ చదువు లన్నింటినీ ఇచ్చే ఉపాధ్యాయునిలా ఇతణ్ణి చేయాలని. అంతే అనుకోవడమే తడవుగా ఆమె తన పుత్రుణ్ణి అలా 'సర్వవిద్యాధిష్ఠాత' గా చేయనే చేసింది. మఱి కాకిపిల్ల కాకికి ముద్దొతూంటే పార్వతీదేవి మాట చెప్పాలా?

ఇలా సర్వవిద్యాధిష్ఠాత అయిన ఆయననీ, ఆయన రూపాన్నీ చూసి నవ్వితే మనం నవ్వుల పాలుగాక తప్పుతామా?. అందుకే ఈ పద్యం వినాయకుణ్ణి **'పార్వతీతనయ!'** అని సంబోధించింది. 'అమ్మకి కొడుకైనవాడా!' అని దీని అర్థం. దశరథుని కొడుకైన రాముడు (దాశరథి) 'నాన్నకొడుకు' అయితే ఈ వినాయకుడు 'అమ్మకొడు'కన్నమాట.

సరే ! ఇంతకీ ఈయన రూపం ఇలా ఎందుకుంది? ఎందుకుంటుంది ? అని ఆలోచిస్తే, ఇది చాల లోతైన ప్రశ్న. దీనికి సమాధానం అయిదు శాస్త్రాల ద్వారా చెప్పాల్సి ఉంటుంది. వరసగా తెలుసుకుంటూ పోదాం.

## వినాయకుని రూపమూ, వినాయక చవితి పూజా వలన తెలిసే ఎన్నెన్నో శాస్త్రాల విశేషాలు

### 1. జ్యౌతిష శాస్త్ర విశేషాలు.

ఈ రోజుల్లో మనందఱికీ గడియారాలు వచ్చేసాక నిముషాలూ - గంటల మీదే వ్యవహారమంతా నడిచిపోతోంది. అయితే ఈ కాలాన్ని లెక్కపెట్టేందుకు 5 తీరుల 'మానా'లని (విధానాలని) కనుక్కొన్నారు ప్రాచీనులు. **(జ్యౌతిషాన్ని గూర్చి కొద్దిగా తెలిస్తే తప్ప ఈ విశేషం అర్థంకాదు గాబట్టి కొద్దిగా విసుగనిపించినా చదవక తప్పదు).**

**1) చాంద్రమానం :** ఉదయించిన చంద్రుణ్ణి బట్టి కాలాన్ని లెక్కించడమని దీని భావం. చంద్రుడు ఉదయించిన మొదటి రోజు పాడ్యమి. రెండో రోజు విదియ. మూడో రోజు తదియ. నాలుగో రోజు చవితి. ఇలా చంద్రుడు ఉదయించిన పదిహేనో రోజు పూర్ణిమ అంటూ లెక్కించారు. దీని వంతటినీ శుద్ధపక్షం లేదా శుక్లపక్షం అన్నారు.

ఇక చంద్రకళలు తగ్గడం ప్రారంభమయ్యే మొదటిరోజుని కూడా 'పాడ్యమి' అనే అన్నారు. రెండో రోజుని విదియ. మూడో రోజుని తదియ ........ ఇలానే అంటూ పదిహేనో రోజుని అంటే - చంద్రుని కళలు (వెన్నెల) ఏ మాత్రమూ లేని రోజుని అమావాస్య అని పేర్కొంటూ అక్కడికి నెల పూర్తి అవుతుంది అన్నారు. చంద్రకళలు తగ్గడం ప్రారంభమై అమావాస్య వఱకూ ఉండే పదిహేను రోజులనీ బహులపక్షం లేదా కృష్ణపక్షం (నల్లగా చీకటితో ఉండే పదిహేను రోజులు) అన్నారు. చంద్రుణ్ణి బట్టి కాలాన్ని కొలవడం భారతీయ విధానం కాబట్టి, చంద్రుడు ఉదయించి క్రమంగా పెరిగే శుద్ధపాడ్యమి నుండి నెల ప్రారంభమవుతుందన్నమాట.

ఇక తెలుగు నెలలకి పేర్లు పెట్టడంలో కూడా ఒక విశేషం ఉంది. ఒక పూర్ణిమ రోజున చంద్రుడు ఏ నక్షత్రంతో ఉంటే ఆ నెలకి ఆ పేరుని పెట్టారు ప్రాచీనులు. ఉదాహరణకి చిత్తా నక్షత్రంతో పూర్ణిమనాడు చంద్రుడుంటే దాన్ని చైత్రమాసం అన్నారు. విశాఖా నక్షత్రంతో పూర్ణిమనాడు చంద్రుడుంటే దాన్ని వైశాఖమాసం అన్నారు. అలాగే పూర్ణిమ నాడు జ్యేష్ఠంతో చంద్రుడుంటే జ్యేష్ఠం - పూర్వాషాఢ లేదా ఉత్తరాషాఢలతో ఆషాఢం - శ్రవణా నక్షత్రంతో శ్రావణం.... అన్నారు. అదే తీరుగా పూర్వాభాద్ర లేదా ఉత్తరాభాద్ర నక్షత్రాలతో పూర్ణిమనాడు చంద్రుడుంటే అది భాద్రపద మాసం అయిందన్నమాట. ఈ పండుగ వచ్చిన ప్రస్తుతపు మాసం ఇదే కదా! ఇదే తీరులో 12 నెలలూ ఏర్పడుతూ ఉంటాయి.

ఇదంతా ఎందుకంటే ప్రాచీనులు ఏదో ఉబుసుపోకకి ఈ పండుగలనీ, పర్వదినాలనీ చెప్పలేదని నిరూపించడానికీ - పర్వదినాలలో ఉన్న జ్యోతిష రహస్యాలలో ఈ వినాయక చవితిలో ఉన్న జ్యోతిష రహస్యాన్ని వివరించడానికీ - ఆ చెప్పబోయే విశేషం అర్థమయ్యేందుకుగా కొద్దిగా పరిచయం చేయడానికీను.

**2) సౌరమానం :** సూర్యుని గమనాన్ని బట్టి కాలాన్ని కొలవడమని దీని భావం. జనవరి 13, 14, 15 తేదీలని భోగి - సంక్రాంతి - కనుము పండుగలుగా భావిస్తూ పధ్నాలుగవ తేదీని మకర సంక్రమణం అని అనడం - అలాగే జూలై 16వ తేదీని కర్కాటక సంక్రమణమని నిర్ణయించడమనే ఈ రెండూ చాంద్రమానం ప్రకారం కాకుండా, సూర్యుడు ఆ మకరరాశీ కర్కాటక రాశీ అనే రెంటిలోనూ క్రమంగా

ప్రవేశించే రోజులని బట్టి ఈ రోజులని నిర్ణయించడం జరిగిందన్నమాట. దీనినే సౌరమానం అంటారు. కాబట్టి మనం అన్ని విధులలోనూ (బాలసారె - ఉపనయనం - వివాహం....) చాంద్రమానాన్నే ఆధారంగా తీసుకుని ముహూర్తాలని పెట్టించుకొంటూ ఉన్నా, సంక్రమణాలని మాత్రం తెలియకుండానే సౌరమానం ప్రకారం చేసుకుంటున్నా మన్నమాట.

3) బార్హస్పత్యమానం : బృహస్పతి (నవగ్రహాలలో ఒకడైన గురువు) ఏ రాశిలో ఉంటే ఆ సంవత్సరం ఆ నదికి 'పుష్కరం' (ప్రతి 12 ఏండ్లకీ వస్తూంటుంది గదా) అనే పేరిట పుష్కర స్నానాలని చేస్తూ ఆయా విధులని నిర్వహిస్తూ ఉంటాం. ఉదాహరణకి కన్యారాశిలో గురువు ఉన్నప్పుడు కృష్ణాపుష్కరాలని చేసుకుంటాం. ఇలాగే మిగిలిన పదకొండు రాశులలోనికీ క్రమంగా గురువు సంవత్సరానికి ఓ రాశిలోనికి చొప్పున వస్తూంటాడు.

ఆ కారణంగా సంవత్సరంలోని పన్నెండు నెలలలోనూ ప్రసిద్ధమైన పన్నెండు నదులకీ దేశంలోని ఆయా ప్రాంతాల్లో ఉన్న కొన్నింటికి పుష్కరాలు వస్తూనే ఉంటాయి. అన్ని పుష్కరాలూ ఒకే నదిలోనే వస్తే దేశంలోని అందరికీ అసౌకర్యం కలుగుతుందని భావించిన పరమేశ్వరుడు, దయామయుడు కాబట్టి అందరికీ అవకాశం కలిగేలా అన్ని ప్రాంతాలలోనూ పుష్కరాలని ఏర్పాటు చేసాడు. ఈ పుష్కరస్నానం ప్రతి పన్నెండు సంవత్సరాలకి ఒక్క మాటైనా చేస్తూన్న మనం, మనకి తెలియకుండానే బార్హస్పత్యమానాన్ని అనుసరిస్తున్నామన్నమాట.

4) సావనమానం : సవనం అంటే యజ్ఞం. యజ్ఞయాగాది క్రతువులకి ప్రత్యేకమైన ఒక లెక్క ఉంటుంది. మామూలు జ్యోతిష దృష్టితో ఆలోచిస్తే ఒక్కోచోటయజ్ఞం ప్రారంభమైన రోజు అపవిత్రమైనదనే భావన కూడా జ్యోతిష జ్ఞానం మాత్రమే కల మనకి కలగవచ్చు.

ఈ వినాయక చవితి పండుగ విశేషాలకీ ఈ మానాలకీ సంబంధం ఏమిటని భావించవద్దు. శ్రీమద్రామాయణ భారత భాగవతాలలో యజ్ఞ ఘట్టాలు కన్పించగానే, ఆ యజ్ఞాలు చేయబడిన రోజులు అపవిత్రమైన దినాలుగా మనకి అన్పిస్తాయి. దీనికి కారణం 'సావనమానం' అనేది ఒకటుందని తెలియకపోవడమే. అపవిత్ర దినాలలో యాగాలని ప్రాచీనులుచేసి ఉండరు కాబట్టి 'కారణం ఏమైయుంటుందా?' అని

ఆలోచించి నిర్ణయించడం విజ్ఞుల లక్షణం అయితే, 'ఇవన్నీ అబద్ధాలు' అని నిర్ణయించడం అవివేకుల లక్షణం.

అంతే కాదు. తమ అజ్ఞానానికి పరాకాష్ఠగా 'అలా అపవిత్ర దినాలలో యాగాలని ప్రారంభించిన కారణంగానే భార్యని విడిచివేయడాలూ - కురుక్షేత్రాలూ - జల ప్రలయాలూ వచ్చి వాళ్లంతా ధ్వంసమై పోయా'రని తోచిన చందంలో దుర్విమర్శ చేయడమంటే తమ అనంత అజ్ఞానాన్ని అద్దంలో చూసుకుంటూ, "బాగున్నానా?" అని మనని అడగడమేనన్నమాట.

ఎవరో విమర్శించారని బాధపడకూడదు. మనమైనా విషయాన్ని తెలుసుకుని సమాధానం చెప్పి యథార్థాన్ని తెలియజెప్పక పోవడం నేరమని గ్రహించాలి. దీన్నిబట్టి **అక్కడక్కడ యజ్ఞాలని చూస్తూన్న మనం, మనకి తెలియకుండానే పాపనమూనాన్ని కూడా అను సరిస్తున్నామన్నమాట.**

5) **నాక్షత్రమానం :** ఏ రోజు ఏ నక్షత్రంతో చంద్రుడున్నాడో గమనించి దానికి అనుగుణంగా దైనందిన కార్యక్రమాన్ని లెక్కగట్టే విధానం నాక్షత్రమానం. దీని ఆధారంగానే మన జ్యోతిషశాస్త్రం నడుస్తుంది. **ఈ విశేషాన్ని వివరించడానికే ఇంత పెద్ద ఉపోద్ఘాతం వ్రాయాల్సి వచ్చింది. (ఇంతకుముందే ఈ విశేషాలు తెలిసిన వారికి అనవసర మన్పించినా తెలియని ఎందరికో అవసరం కదా!)**

ఈ నాక్షత్రమానం ఆధారంగానే ప్రతివ్యక్తీ పుట్టింది ఏ నక్షత్రంలోనో, ఆ 'ఆరోజున ఆ నక్షత్రం ఉండే మొత్తం కాలంలో' ఎంతకాలం అయ్యాక ఈ వ్యక్తి పుట్టాడో, దాన్ని బట్టి ఏయే గ్రహాలు ఎక్కడెక్కడ ఉన్నాయో, వాటి ఫలితాలు ఎలా ఎలా ఆ పుట్టిన వ్యక్తిపై ఉంటాయో నిర్ణయించడం... ఇదంతా జరుగుతూ ఉంటుంది. సంస్కృతంలో నక్షత్రానికే మరో పేరు 'జ్యోతిస్సు' అని. ఆ జ్యోతిస్సు ఆధారంగా వ్రాయబడిందే జ్యోతిష శాస్త్రం.

ఇదీ - పైన చెప్పుకున్న చాంద్రమానమూ ఒకటేనేమో అనుకోరాదు. ఈ నాక్షత్రమానంలో ఖగోళ విశేషాలు కూడా ఉంటాయి. అది ఇక్కడి సందర్భానికి అసందర్భ మౌతుంది. కాబట్టి ఇలా జ్యోతిషంలోకూడిన ఖగోళ విశేషాలు ఈ వినాయకుని రూపం - చవితిపూజలో ఏమున్నాయో తెలుసుకోవడం ప్రస్తుతాంశమన్నమాట.

## వినాయక రూపమూ - జ్యోతిష శాస్త్ర రహస్యాలూ

వినాయకుడు హస్తిముఖుడు, హస్తమంటే తుండం. హస్తం కలది హస్తి అంటే ఏనుగు. అలాంటి ఏనుగు ముఖం కలిగిన వాడు వినాయకుడని భావం. కాని లోభావం అదికాదు.

మనందఱం ఎలా ఏదో ఒక నక్షత్రంలో పుట్టామో అలాగే వినాయకుడు కూడా పుట్టిన నక్షత్రం 'హస్త'. ఆ విషయాన్ని ఈయన ముఖం చూడగానే గుర్తించాలని హస్తిముఖుణ్ణి చేసారు. ఆ 'హస్తిముఖాన్ని' (ఏనుగు ముఖాన్ని) చూస్తూనే ఈయన పుట్టింది హస్తానక్షత్రమని గుర్తుకి తెచ్చుకోవాలని ప్రాచీనుల ఆలోచనం.

దీనికి ముందుదైన కృష్ణాష్టమిని గుఱించి ఒక్క మాట అనుకుందాం.కృష్ణుడు పుట్టింది అష్టమీ విద్ధ (అష్టమితో కూడిన) నవమిలో - రోహిణీ నక్షత్రంలో. ఆ రెండూ శ్రావణ మాసంలో ఎప్పుడుంటే ఆ రోజు కృష్ణాష్టమి అయింది గదా! అలాగే భాద్రపద శుద్ధ చవితీ హస్తా నక్షత్రమూ ఎప్పుడుంటే అది వినాయక చవితి అన్నమాట.

దీన్ని బట్టి పుట్టిన రోజు పండుగని, తిథీ నక్షత్రాలని బట్టి చేసికోవాలి గాని ఆంగ్లసంవత్సరపు తేదీలని బట్టి కాదని గమనించాలి. మనం గొప్పవాళ్లం కాదు కాబట్టీ, మన పుట్టిన రోజులకి తిథీ నక్షత్రం అనే ఈ రెండూ కలిసిన రోజు రావడం అరుదు కాబట్టి, మనం పుట్టిన తిథి ఉన్న రోజున పుట్టిన రోజుని జరుపుకోవడం సరైన విషయమని గమనించాలి. కాబట్టి భాద్రపదమాసంలో, శుద్ధ పక్షంలో చవితి తిథినాడు హస్తానక్షత్రం ఎప్పుడుంటుందో ఆరోజు వినాయకచవితి లేదా వినాయక చతుర్థి లేదా గణేశ చతుర్థి.... అవుతుందన్నమాట.

ఇంతకీ, ఈ హస్తా నక్షత్రం కన్యారాశికి చెందింది అవుతుంది. కన్య అంటే పెళ్లికానిదని సామాన్యమైన అర్థం. అందుకనే ఈయనకి వివాహం కాలేదంటారు.

గ్రహాలలో ఒకడైన బుధుడు ఈ కన్యారాశికి అధిపతి. బుధుడంటే పండితుడని అర్థం. అందుకే వినాయకుడు 'విద్యల కెల్ల ఒజ్జ (ఆది పూజ్యుడు)' అయ్యాడు. మహాపండితుడు కూడాను.

ఈ బుధుడు ఆకు పచ్చగా ఉంటాడు. అందుకే బుధగ్రహం అనుకూలంగా ఎవరికైనా లేకపోతే నవధాన్యాల్లో ఆకుపచ్చనివైన పెసలని దాన మిప్పిస్తారు. బుధగ్రహ దోషం ఉన్నవారికి వాక్పటిమ (ధారాళంగా మాట్లాడగలగడం - తమ అభిప్రాయాన్ని

స్పష్టంగా చెప్పగలగడం - ఉచ్చారణలో (శ్రావ్యత-స్పష్టత.....) ఉండదు. 'ఇలా ఆకుపచ్చని వాడైన బుధ గ్రహానికి సంబంధించిన వాడు వినాయకుడు సుమా!' అనే ఈ విషయాన్ని గుర్తుంచుకొనేలా చేసేందుకై 'ఆకుపచ్చని పత్రాలతో పూజ' ఈయనకి ఏర్పాటు చేసారు.

మఱీ లేతగా ఉన్న ఆకుపచ్చని రంగుతో బుధుడు ఉంటాడని గ్రహించాలనే బుద్ధితోనే 'పత్రిని' క్రిందటి రాత్రే తేవద్దనీ, పండుగ నాటి ఉదయాన్నే తేవలసిందనీ ప్రాచీనులు చెప్పారు. తగిన వసతి సౌకర్యాలు లేనప్పుడూ-గమనించవలసిన ఈ విషయాన్ని గమనించి కావాలని ఎదిరించడం కాక, కుదరక తప్పని సరిగా క్రిందటి రాత్రే పత్రిని తెస్తున్న ఏ కొందఱినో భగవంతుడు ఏమీ దూషించడూ - శపించడూను. ఆయన అవ్యాజ కరుణామూర్తి. నిష్కారణంగా కరుణని వర్షించే స్వరూపం ఉన్నవాడే గాని మనలాగా రాగ ద్వేష స్వరూపి కానే కాడు.

అయితే మఱునాటి ఉదయం తెచ్చుకోగల్గిన అవకాశం ఉండి కూడా బద్ధకంతోనూ - పై చెప్పుకున్న తీరుగా క్రిందటి రోజునే తెచ్చుకోవచ్చుననే అవకాశముంది కదా అనే వంకతోనూ నేడే తేవడం నేరమని వేఱే చెప్పాలా?

## 2. ఖగోళ శాస్త్ర రహస్యాలు

ఈ వినాయకుని రూపంలో పై చెప్పుకున్న తీరుగానే కాక ఖగోళ రహస్యాలు కూడా దాగి ఉన్నాయనే విషయాన్ని గమనింపచేయడానికే ఖగోళంలో ఉండే చంద్రవంక ఇతని తలపై ఆభరణంగా ఉంటుంది. శంకరుని తలపై ఆభరణంగా ఉండడం, విష్ణువు ఒక కన్ను చంద్రుడు కావడం ఇవన్నీ ఈ ఖగోళ రహస్యాలున్న తీరుని గమనించవలసిందని చెప్పడానికి ఏర్పాటు చేసిన రూప కల్పనలే. నిజానికి ఆలోచిస్తే 'న తస్య ప్రతిమా స్తి' పరమేశ్వరునికి రూపమే లేదని గదా శాస్త్రం చెప్తోంది. ఏదో ఒక రూపాన్ని ఎదురుగా ఉంచుకొని వాని ద్వారా పరబ్రహ్మారాధనని చేయడం కోసమే ఈ రూపకల్పనమంతా.

ఇక ఈ వినాయక చవితి రోజులలో ఆకాశాన్ని చూస్తే, తూర్పు ఉత్తరాల నడుమ దిక్కు అయిన ఈశాన్యం నుండి, దక్షిణ పశ్చిమాల నడుమ దిక్కు అయిన నైఋతి వఱకూ నక్షత్రాలు ఒక పూలకొమ్మలాగా ఒక తీగెలా కన్పిస్తాయి. దీన్నే ఆంగ్లేయులు 'గెలాక్సీ'అనీ, మనం పాలపుంత అనీ అంటాం. దీన్ని గుర్తుంచుకొనేందుకు వీలుగా వినాయకునికి తెల్లని జందెం (యజ్ఞోపవీతం) ఎడమ భుజం మీది నుండి

కుడి చేతి క్రిందికి ఏటవాలుగా ఏర్పటిచారు. అందఱు దేవతలకీ యజ్ఞోపవీతం ఉన్నా ఈ దేవుని యజ్ఞోపవీతంలోని ప్రత్యేకత ఇదన్నమాట. ఈ దేవునికి పాలవెల్లిని కట్టడం కూడ ఖగోళ రహస్యం ఉందని సూచించడానికే. అంతటి ఆకాశంలో ఇలా కొన్ని నక్షత్రాలుమాత్రమే కన్పిస్తూ ఉండడంతో ఖాళీగా ఉన్న ఆకాశానికి సంకేతంగా వినాయకునికి లంబోదరం (పెద్ద బొజ్జ) ఏర్పాటు చేసారు.

విశాలమైన ఆకాశంలో ఈ పాలపుంతకి దగ్గఱగా కొన్ని నక్షత్రాల గుంపు సుడిగుండంలా కన్పిస్తుంది. దాన్ని ఆయన బొడ్డుగా ఊహించారు. ఈ సుడి గుండంలా ఉన్న నక్షత్రాలపైన కొన్ని కిరీటంలా కన్పడే నక్షత్రాలు కన్పిస్తాయి. ఆ నక్షత్రాలని ఎత్తిన పడగ కల పాముగా గుర్తుంచుకొన వలసిందని గుర్తుచేస్తూ ఈ దేవుణ్ణి నాగాభరణధారి (పామునే తలకీ అలాగే నడుముకీ ఆభరణాలుగా ధరించినవాడు) అన్నారు. అలాగే ఈశాన్య భాగంలో ఉన్న నక్షత్రాలగుంపు కూడా తలని ఎత్తిన పాములా కన్పించడంతో ఈయనని 'నాగయజ్ఞోపవీతి' (పామునే యజ్ఞోపవీతంగా ధరించినవాడు) అన్నారు.

కొద్దిగా పరీక్షగా ఆకాశాన్ని చూస్తే ఎన్నెన్నో ఖగోళరహస్యాలని తెలిసే వీలుంటుంది. ఇదంతా అసత్యమనుకొనే వీలు లేదు. కారణం మన ఇండ్లముందు తెలవారుజామునే ముగ్గుల్ని వేసే ప్రతి బాలికా మొదటగా నేర్చుకునేది మూడు x మూడు చుక్కల ముగ్గునే.



ఇది నవగ్రహాలకీ సంకేతం. అన్నిటికీ ఎటుచూచినా మధ్యలోఉండేది సూర్యగ్రహమన్నమాట. ఏ శివాలయంలోనైనా ఉన్న నవగ్రహాలని చూస్తూ, ఈ ముగ్గుని పరిశీలిస్తే చాల విశేషాలు తెలుస్తాయి. మనకీ ఆకాశంలోని గ్రహాలకీ చాల పోలిక ఉంది. గ్రహ తీతి గ్రహః - తిరిగేది ఏదో దాన్ని గ్రహం అన్నారు. గ్రహాలలాగా మనం కూడా దేవుని చుట్టూ ప్రదక్షిణం చేస్తాం. అంతేకాదు. తమ చుట్టూ తాము తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరిగే గ్రహాలని అనుకరిస్తూ ఆత్మ ప్రదక్షిణనమస్కారాలని కూడా చేస్తాం.

అలాగే పెళ్లిళ్లలో అరుంధతీ నక్షత్రాన్ని చూడడం - పంచాంగాలలో కన్పించే పురశ్శుక్ర దోషాన్ని (చుక్క ఎదురుగా ఉన్నప్పుడు ప్రయాణం మానేయడం - వివరంగా మరో సారి చూద్దాం) - ...... వంటివన్నీ మన మీద ఖగోళ ప్రభావం ఉందని సూచించేందుకూ, అక్కడి మార్పులని గమనించి రాబోయే వాతావరణపరిస్థితులని ఊహించి నడవాలని సూచించేందుకూ ఏర్పాటు చేసినవే.

ఇక వినాయకుడు పుట్టిన హస్తానక్షత్రానికి సూర్యుడు అధిపతి. సూర్యుడు తేజస్సునిస్తాడు. . . . . ధియో యో నః ప్రచోదయాత్ అని వేద మంత్రం చెప్తుంది కాబట్టి, ఆ సూర్యుని తేజస్సుని ఆరాధిస్తే బుద్ధి శక్తికూడా పెరుగుతుంది. అందుకని శరీరానికి తేజస్సూ, వ్యక్తికి బుద్ధిశక్తీ కావాలంటే గణపతిని ఆరాధించడం తప్పనిసరి అన్నమాట. మహాపండితులెందరో గణపతి ఉపాసన కలిగినవారే అన్నది లోకసత్యం కదా!

ఇలాటి హస్తా నక్షత్రం చంద్రునితో కలిసిన రోజున, అంటే ఈ వినాయక చవితినాడు గణపతిపూజని భక్తిశ్రద్ధలతో చేస్తే - చంద్రమా మనసో జాతః - కాబట్టి మనస్సుకి స్వస్థతా శాంతీ, చంద్రుని రంగుతో సమానంగా ఉండే కీర్తీ వ్యక్తి కి తప్పక సిద్ధిస్తాయన్నమాట. అంటే ఒక విధంగా సూర్య చంద్రుల ఇరువురి శక్తినీ పొందగల్గిన అవకాశం ఇచ్చేది 'ఈ వినాయక చవితి' అని తెలుస్తోంది గదా.

## 3. వ్యవసాయ శాస్త్ర విశేషాలు

సంవత్సరంలోని ప్రతి రెండు నెలలూ ఒక ఋతువుగా లెక్కింపబడు తూంటాయి. శ్రావణ భాద్రపదమాసాలకి వర్షర్తువని పేరు. ఈ రెండు నెలల్లో కుండపోతగా వర్షాలు కురవాలి. ధర్మం అడుగంటిన కొద్దీ వర్షాలు వెనక బడతాయని శాస్త్రం చెప్తోంది. కాబట్టి వర్షాలు ఎప్పుడు ఎక్కువగా పడితే అది వర్ష ఋతువు అనుకోరాదు.

శివుడు సూర్యునికి సంకేతం. 'నీలగ్రీవో విలోహితః' అని నమక మంత్రాలు శంకరుణ్ణి గురించి చెప్పాయి. నీలిరంగు మెడ కలవాడూ - మిక్కిలి ఎఱ్ఱగా ఉండేవాడూ అని దీని అర్థం. సూర్యుణ్ణి అలా తీక్షణంగా చూస్తే బింబం ఎఱ్ఱగా ఉండడమూ - లోపల నీలిరంగుగా ఒక బింబం కన్పడడమూ జరుగుతుంది. సూర్యుడు నీటిని తన కిరణాల ద్వారా పీల్చి భూమికి వర్షంగా విడుస్తాడు. గంగాదేవిని శంకరుడు భూమికి పంపించాడనే పూర్వ కథకి అర్థం ఇదే.

వర్షాలులేకపోతే సూర్యారాధనం (సూర్య జపం) చేస్తారు. శివాలయాల్లో 'సహస్రఘటాభిషేకం' అని చేస్తారు. నమక చమక మంత్రాలతోపాటు మరికొన్ని ముఖ్యమైన మంత్రాలని చదువుతూ వేయి కుండలనీటితో శివుణ్ణి అభిషేకించడం ఈ సహస్రఘటాభిషేకంలో జరుగుతుంది. శివుడు తన భార్యని తలపై ధరించాడని అనడానికి కారణం, శివుని కారణంగానే నీరు లోకానికి వస్తుందని చెప్పడమన్నమాట. ఎన్నెన్నో కారణాలని బట్టి శివుడు సూర్యునికి సంకేతం. గంగ, నీటికి సంకేతం.

పార్వతి భూమికి సంకేతం. పర్వతం నుండి పుట్టినది పార్వతి. 'అబ్భ్యః పృథివీ' నీటినుండి భూమి పుట్టిందని శాస్త్రం చెప్తోంది. ఆకాశం నుండి కురిసిన వర్షం నిరంతరం అలా పర్వతాల మీదుగా జారుతూ నేల మీదికి పడుతూండడం వలన ఆ నీటి రాపిడికి పర్వతం చిన్నచిన్న ఇసుక అణువులుగా విడిపోతూ నేలకి చేరి, వాయువు తెచ్చిన ధూళితో కలిసి భూమి అవుతోందనేది భౌగోళిక సత్యం కదా.

ఇప్పుడు వినాయకుని కథలోనికి వద్దాం. తన అభ్యంగన స్నానానికి (తలంటు) ముందు, ఒంటికి నలుచుకొన్న నలుగుపిండితో ఈ పార్వతి ఒక బాలుణ్ణి ఏర్పాటు చేసింది ద్వార పాలకునిగా. శంకరుడు వచ్చాడు. ఆమె స్నానం చేస్తోంది కాబట్టి లోపలికి పోనీయనన్నాడు బాలుడు. శంకరుడు వాని తల నరికాడు. ఆ పిమ్మట ఆమె వచ్చి చాల దుఃఖించింది. శంకరుడు వానికి ప్రాణం పోసి ఏనుగు తలని తెచ్చి అతికించాడు. కథ ఇంతే కదా. అయితే సంకేతరూపంగా ఉన్న ఈ కథని వివరంగా అర్థం చేసికోవాలి.

**పార్వతి తన నలుగుతో వినాయకుణ్ణి చేసింది. నలవడం అంటే అణిచిరాయడం దీన్నే దున్నడం అనాలి. ఆమె స్నానం చేయడానికి వెళ్లిందంటే భూమిని నీటితో తడిపి పదును పెట్టడం చేసింది. ఇంతలో శంకరుడు రానేవచ్చాడు. అంటే భూమిని దున్నాక - నీటితో పదును చేసాక - వినాయకునికి ప్రాణప్రతిష్ఠ జరిగింది. అంటే భూమినుండి మొలక రూపంలో ఏవేవో ధాన్యపు మొక్కలు పెరిగాయి. ఆ మొలకలే వినాయకుడు. అప్పుడు శంకరుడు వచ్చాడు.**

**శంకరుడంటే సూర్యుడని లోగడ అనుకున్నాంగదా! అలాటి సూర్యుడైన తనకీ, ఆభూమి అయిన పార్వతికీ నడుమ అడ్డుగా ఉన్న బాలకుణ్ణి - మొలకలుగా ఉన్న లేత**

పంటని - శూలంతో ఖండించాడు శివుడు. అంటే కొడవలితో కోసి పంటని ఇంటికి తెచ్చాడన్నమాట. వినాయకునికి గణిక ఇష్టమని చెప్పడంలోని రహస్యం ఇదే. లేతపంట అయిన గణిక ఆయనే కాబట్టి. దుఃఖించిన పార్వతి, తన బాలుణ్ణి బ్రతికించవలసిందిగా (ప్రాణ ప్రతిష్ఠ) ప్రార్థించింది. ధాన్యాన్ని పంచభూతాలకీ విడిచివేయడం కాక, ఒకచోటకి పరిచేసి, ఒక వ్యవస్థని చేయాలని భావించింది. ఆ కోరికని తెల్పగానే ఆ ధాన్యపు విలువకోసం ఒక అగారాన్ని (గాదె) ఏర్పాటు చేసాడు శంకరుడు.

వినాయకుని పెద్దబొజ్జ - ఆ గాదెకి సంకేతం. ఆయన ఏనుగు తల - ఆ గాదెకి పైన అమర్చబడిన చూరుతో కూడిన కప్పుకి సంకేతం. ఆయన తుండం - ఆ లోపలి ధాన్యం పూసిపోకుండా సన్నగా గాలి తగలడానికై ఏర్పాటు చేయబడి ఒకవైపు తిరిగిన, సన్నని చిల్లులున్న గొట్టానికి సంకేతం.

ఆయన నోరు - ఈ గొట్టాన్ని తీసివేస్తే కన్పడే, ధాన్యం తీసికొనేందుకు వీలైన చిన్నతలుపుకి సంకేతం. ఆయన దంతాలు రెండూ - గాదెకి పై భాగాన అమర్చబడిన - గొట్టం లోపలికి దిగిపోకుండా అటూ ఇటూ ఏటువాలుగా లోపలికి దిగగొట్టిన చెక్క మేకులకి (గడమేకులు - గడబొంగు మేకులు) సంకేతం. ఆ చంద్రవంక - గాదెపై దాచుకున్న కొడవలికి సంకేతం.

ఆ చేటచెవులు రెండూ - గాదెకు ఇటు ప్రక్కా, అటుప్రక్కా తగిలించి ఉంచిన తూర్పార బోసిన చేటలకు సంకేతం. ఆయన బొడ్డు - గాదెకి క్రింది భాగం నుండి కొద్దిపైగా పెట్టిన సన్నని తలుపుకి (కొద్దిపాటి ధాన్యం కావలసి వస్తే తీసుకొనేందుకు వీలైన) సంకేతం. వినాయకుని కిందనున్న పీఠం గాదెకి కింద ఏర్పాటుచేయబడిన గడమంచెకి సంకేతం.

ఆయన వాహనమైన ఎలుక - 'ధాన్యం దీనిలో ఉంది సుమా'! అని చెప్పే ఎలుకలకి సంకేతం. ఆయన నడుముకి ఉన్న నాగాభరణం - ఎలుకలకి భయాన్ని కల్గించడానికై గాదెపై చిత్రించబడిన సర్పాకారపు బొమ్మకి సంకేతం.

ఇక గౌరవర్ణం కలిగి దేవత అయిన ఆమె పేరు గౌరి. ఎండకు ఎండీ - వానకు తడిసీ - మంచుకి మెత్తబడిపోయీ - ఇలా దశదశకీ మారే ఈ రంగులన్నీ గౌర వర్ణాలే. గౌరి కూడా శంకరుణ్ణే వివాహం చేసికోవాలని ఇలాగే ఎండా - వానలని లెక్కచేయక తపస్సు చేసి చేసి గౌరవర్ణం కలదై 'గౌరి' అయింది. ఆమెకి పుట్టిన వినాయకుడు గౌరీపుత్రుడు కూడా అయ్యాడు. మొదట్లో లేత ఆకుపచ్చరంగు - పిమ్మట

ముదురాకుపచ్చరంగు - పంటకోసేసాక లేతపసుపు రంగుగా మారిన మోడులతో 'గౌరీ గర్భ సముద్భవు' డయ్యాడన్నమాట. గౌరవర్ణం కల వెంట్లుగా గడ్డిని చుట్టి వాటితో గాదెని కట్టి, దానిలో ధాన్యం పోయడంవలన కూడా ఈయన గౌరీ పుత్రుడే అవుతాడు.

శివుడు సూర్యునికి సంకేతం అనుకున్న విషయం నిజం కాబట్టే శివపుత్రుడైన వినాయకుని చవితి, సూర్యునికి శక్తి బాగా ఉండే ఆది(త్య) వారం రోజున వస్తే చాల గొప్పదని చెప్తారు.

అలాగే పార్వతికి 'సర్వమంగళ' అని పేరు. వినాయకుడు పార్వతికి పుత్రుడు. 'కుజ' అనే పేరున్న గ్రహం ఒకటుంది. కు=భూమికి, జ=పుట్టినవాడు అని జ్యోతిషంలో దీని భావం. ఇతణ్ణే మంగలగ్రహం అని కూడా అంటారు. కాబట్టి ఇందాక అనుకున్నట్టుగా ఆదివారమే కాక మంగలవారం నాడు వినాయక చవితి వచ్చినా ఎంతో విశేషంగా చెప్తారు. కారణం, పార్వతి సర్వ 'మంగల' కావడమే. వినాయకుడూ కుజ (మంగలం) సంబంధం కలవాడూ కావడమే. ఈ మంగలవారం - ఈ యిద్దటిలో ఉన్న 'మంగల' విశేషానికి సంకేతమన్నమాట.

## 4. వైద్య శాస్త్ర విశేషాలు

ప్రాచీనులు ఏర్పాటుచేసిన ఏ పండుగలోనైనా ఆధ్యాత్మిక విశేషాలతోపాటు వైద్యరహస్యాలు కూడా ఉంటాయనేది నిశ్చయమైన విషయం. ఇంటికెందరో చుట్టాలు వచ్చే శుభకార్యం వేళ ఇంటికి మామిడాకుల తోరణాలు కడతాం. అలా వచ్చే చుట్టాలలో ఏ ఒకరికైనా అంటువ్యాధి గాని ఉంటే, ఒకరినుండి మఱొకరికి ఆ అంటువ్యాధిని సోకనీయకుండా ఈ మామిడాకుల గాలి తాత్కాలికంగా ఆపు చేయగలదట.

అలాగే దేవాలయంలో హారతినీయడమనేది - ఆ నీరాజనపు వెలుగులో పరమేశ్వరుని మూర్తిలోని ప్రతి అవయవాన్నీ స్పష్టంగా చూడగలగడంకోసమూ - ఎటువైపూ కిటికీ లేక చీకటిగా ఉన్న దేవుని అంతరాలయంలో దుర్వాసన రాకుండా ఉండడంకోసమూ - క్రిములని నశింపచేయడం కోసమూను. హారతి వెలిగించగానే ఆ వెలుగుని చూచిన క్రిములు తమంత తామే దానిలో వచ్చి పడిపోతాయి.

ఇక హారతి నుండి వచ్చిన వాసన, భక్తుల శ్వాసకోశాలకి చాల మంచిదై వ్యాధులుంటే తొలగిస్తుంది కూడ. మండుటెండల కాలంలో జరిగే శ్రీరామనవమికి పానకాన్నీ - తడి పెసర పప్పుని 'వడపప్పు' అనే పేరిట ప్రసాదంగా పెట్టడానికీ కారణం వడదెబ్బ తగలకుండా చేసేందుకే. అలాగే శ్రావణమాసంలో ఇయ్యబడే సెనగలు కూడా ఆరోగ్య పరిరక్షణార్థమే.

ఇక జోరున కురిసే వర్షర్తువులోని భాద్రపద మాసంలో వచ్చే వినాయక చవితికి ఉండ్రాళ్లని నైవేద్యం (దేవుని కిష్టం అనే పేరిట) పెట్టి ఆరగించమనడం కూడ ఆరోగ్య పరిరక్షణం కోసమే. ఉండ్రాళ్లు ఆవిరి మీద ఉడికే పిండివంట కదా! అలాగని అతిగా స్వీకరిస్తే ఏదయినా విషంతో సమానమే ఔతుందిట.

"హితాశీ మితాశీ కాలాశీ చేతి' అంది ఆయుర్వేదం. హితమైనదాన్ని తినాలి. ఆరోగ్యం సరిలేక ఉండ్రాళ్లు రుచించకపోయినా, తినవద్దని వైద్యుడు సూచించినా 'భగవంతుడి ప్రసాదం గదా'! అనే భయంతోనో, భక్తితోనో తినవద్దంది శాస్త్రం. ఒక వస్తువు హితంగా లేకపోవడం ఆ వ్యక్తి శరీరంలోని అనారోగ్యానికి సూచకం.

హితంగా ఉంది గదా! అని అమితంగా తినరాదుట. మితంగానే స్వీకరించాలిట. చుట్టాలో బంధువులో మొగమాట పెట్టారని తింటే 'రోగంతో అవస్థ పడవలసింది వాళ్లు కాదు గదా!' గమనించాలి. ఇక మూడవది కాలాశి. సరైన కాలంలో తినాలి. భాద్రపదంలో ఇలా, గ్రీష్మఋతువులో మరొకలా .. .. అలా ఏ కాలానికి ఏది తగిన ఆహారమో గమనించి దాన్ని తినాలిట. ఏది సరైన ఆహారమో ప్రతివారికీ తెలియదు గాబట్టి, ఆ విషయాన్ని తెలిసిన పెద్దలు 'వేటిని వేటిని ఈ కాలంలో తినాలో - తినవచ్చో మనకి' ప్రసాద రూపంలో తెలియ చేసారన్నమాట.

ఇంతకీ వినాయక చవితి భాద్రపదంలో వచ్చే కారణంగా ఎన్నెన్నో విత్తనాలు మొలకెత్తుతాయి. చెట్లు పెరుగుతాయి. దేవుణ్ణి పత్రాలతోనే పూజించవలసి ఉందనడానికి కారణం - వైద్యశాస్త్ర పరంగా ఏ ఆకులో ఎంతెంత ఓషధీ గుణం ఉందో ప్రతివ్యక్తీ గమనించాలని.

ఉదాహరణకి వేపలో చర్మవ్యాధులని పోగొట్టే గుణం ఉంది. వేపరసంతో రోజుకి ఒకమాటు నోటిని పుక్కిలిస్తే పుప్పిపన్నులుండవు. నోటి నుండి దుర్వాసన

రాదు. పళ్లకి ఏది తగిలినా జివ్వున లాగే దోషాన్ని ఉత్తరేణి పుల్ల పోగొడుతుంది. రోజూ దానితో పళ్లని శుభ్రపఱచుకోవాలన్నమాట. అసలు వేప - ఉత్తరేణి వంటి వాటిని నోట్లో పెట్టుకోగానే 'ఏదో ఓషధీ గుణం ఉంది సుమా!' అనే విధంగా వాటి రుచి ఉంటుంది.

ములగాకుతో పప్పు చేసికొని తింటే కడుపులో వాత దోషం పోతుంది. ఏమైనా పైకి గాయం కన్పించని దెబ్బలు లోపలి కండరాలకి తగిలి ఉంటే ఆ వ్యాధి ముదరకుండా అరికట్టి తగ్గిస్తుంది. ముఖ్యంగా క్రీడాకారులు దీనిని వాడడం మంచిది. ఇక వాపులకి ములగ కాకరాకులని నూనెలో ముంచి వెచ్చవెచ్చగా కాల్చి కట్టడమనేది లోకంలో ఎప్పటినుండో ఉన్నదే. ఇక ఉసిరి ఆకు - ఉసిరికాయ - ఉసిరిగాలి - ఉసిరి గింజ అన్నీ వైద్యానికి పనికొచ్చేవే.

చేతిలో ఉసిరి ఉంటే ఆరోగ్యం ఉన్నట్లే అనే విషయాన్ని లోకానికి తెలియచెప్తూ 'కరతల ఆమలకం' అనే మాటని లోకానికి తెలియచేసారు ప్రాచీనులు. ఉసిరిని ముక్కలుగా కోసి ఎండ బెట్టుకొని పొడిదగ్గు వస్తున్నపుడు నోటిలో ఉంచుకుని లాలాజలంతో అలా చప్పరిస్తూంటే దగ్గు మటుమాయమౌతుంది. శరీరానికి పట్టిన నీటిని లాగే గుణం, వెచ్చగా కాల్చిన పచ్చితాటిఆకుకీ, ఆముదపాకుకీ ఉంటుందట. ఇలా ఎన్ని లేవు!! ఎన్నని అనుకోగలం!!!

అందుకని వర్షర్తువులో వచ్చిన ఈ పత్రాలని సేకరిస్తూ వాటిలోని వైద్యరహస్యాన్ని గుర్తించి పదికాలాలపాటు ఆరోగ్యవంతంగా జీవించగలందులకూ, ప్రతివ్యక్తీ ఒక వైద్యుడుగా ఉండేందుకూ, నిస్స్వార్ధ బుద్ధితో అందఱూ మెలిగేందుకూ ఏర్పాటుచేయబడింది ఈ పత్ర విధానం.

ఇది ప్రతిసంవత్సరమూ జరిగే పండుగ కాబట్టి, పత్రాలలో దాగి ఉన్న వైద్యరహస్యాలని ముత్తాత తాతకి చెప్తే, తాత తండ్రికి అందిస్తే, తండ్రి కొడుక్కి తెలియజేస్తే, అతడు తన తరవాత వారికి ఈ రహస్యాన్ని అందిస్తూ వెడతాడు. అంటే ఈ వైద్యరహస్యాలు ఇలా శాశ్వతం కావడానికి పరోక్షంగా ఈ పండుగ తోడ్పడుతుందన్నమాట. ఇప్పటి వఱకూ ఆకులలో ఉన్న వైద్య రహస్యాలని ఇలా తెలుసుకొని ఉండకపోయినట్టైతే, ఇప్పటినుండైనా తెలుసుకోవడం సరైందికదా!

కాళ్లాగజ్జీ కంకాళమ్మా - వేగూచుక్కా వెలగామొగ్గా - మొగ్గా కాదూ మోదుగబావీ - బావీకాదూ బచ్చలపండూ.... అంటూ ఇలా సాగే ఈ పాట, కాళ్లకి గజ్జి

(చర్మ వ్యాధి) వస్తే కంకాళపు వేరు రసాన్ని రాయమంది. తగ్గకపోతే (అంటే వ్యాధి కొద్ది ముదిరిందనీ - లేదా - ఆ ఔషదం వ్యక్తి శరీరతత్త్వానికి పడలేదనీ భావించాలన్నమాట.) తెలవారు జామున మంచుతో ఉన్న వెలగ చెట్టు నుండి వచ్చిన మొగ్గని దంచి రాయాలిట. దీనికీ తగ్గకపోతే ... అంటూ ఇలా అనేక ఉపాయాలతో వైద్యశాస్త్రాన్ని చెప్తోంది ఈ పద్యం. ఎంత దూరదృష్టి ప్రాచీనులది!

కొండమీద కొక్కిరాయి కాలు జారి కూలిపోతె .... నిమ్మకాయ పిండు నూటొక్కధార - నిమ్మకాయరసపు బొట్లని నూటొక్కంటిని వేస్తూ నెమ్మదిగా మర్దన చేయాలని ఎంతో వైద్య సూక్ష్మాన్ని చెప్తోంది ఈ చిన్న పాట ! నల్లేరు - జిల్లేడు -ఉమ్మెత్త - అవిసె - మద్ది - చింత ... ఇలా అన్ని ఆకులూ వైద్యానికి సంబంధించినవే.

ఏదో ఒక తీరు రోగాన్ని నయం చేసేవే. చాదస్తం అనుకోకా - వట్టి మాటలే అనుకోకా తెలుసుకోగలగాలి. అసలు పండుగలకీ పబ్బాలకీ నలుగురు కలిసినప్పుడు ఈ విషయాలని కూడా ముచ్చటించుకోవాలి.

శ్రీమద్రామాయణంలో ఆరణ్య కాండంలో ఒక ఘట్టం వైద్యశాస్త్ర రహస్యాన్ని చెప్పేది ఉంది. జటాయువు రెక్కలని రావణుడు నరికి సీతమ్మని ఎత్తుకొని పోతూంటే (నికృత్తపక్షం రుధిరావసిక్తం తం గృధ్రరాజం.. . ..) రెక్కలనుండి రక్తం ఓడుతూ ఉండగా, సీతమ్మ ఆ జటాయువుని కౌగిలించుకున్నదట. భూమి కూతురు గదా సీతమ్మ! భూమి నుండి ఓషధులు పుడతాయి గదా! ఆ కారణంగా రక్తం ఓడుతున్న జటాయువుకి ఆమె ప్రథమ చికిత్సని చేసినట్లయింది. ఈ కారణంగానే రాముడు వచ్చేంత వఱకూ జటాయువు జీవించి ఉండగలిగాడు.

ఇక అన్ని ఆకులూ ఒక ఎత్తు, విష్ణువుకి ప్రీతిపాత్రమైన తులసీ - శివప్రియమైన మారేడూ ఒక ఎత్తు. తులసితీర్థం శ్వాసకోశవ్యాధులని తొలగిస్తుంది. మారేడు జీర్ణక్రియని క్రమబద్ధం చేస్తుంది. అందుకే ప్రాతః కాలంలో విష్ణుదర్శనాన్నీ, సాయంకాలంలో శివదర్శనాన్నీ చేయవలసిందన్నారు పెద్దలు. తులసి ఆకులతో మిరియాన్ని కలిపి తినడం - వట్టిగా తులసీ ఆకులని రోజూ తినడం అనేది స్త్రీలలో ఉండే స్త్రీ సంబంధమైన ఋతుదోషాలని ఎన్నింటినో నయం చేస్తుంది.

సంస్కృతంలో పాషాణ (రాళ్లను) భేది (పగులగొట్టేది) అని పిలువబడే కొండపిండి ఆకుతో పప్పుని కొన్ని రోజుల పాటు తింటే శరీరంలోని కిత్తులలో పెరిగే

ఊళ్లు హరించిపోతాయి. ఇలా ఎన్నెన్నో రహస్యాలని ఎవరికివారు గుర్తించవచ్చు. లేదా అనుభవజ్ఞులైన పెద్దల ద్వారా ఈ పండుగ వంకతో తెలిసికోవచ్చు. తమ పిల్లలకి తెలియజేస్తూ అలా ఆ రహస్యాలని మఱుగున పడిపోనీయకుండా ప్రతి సంవత్సరమూ ప్రచారం చేసుకుంటూ ఆ రహస్యాలని శాశ్వతీకరింపనూవచ్చు.

వినాయకుని మండపానికీ లేదా ఇంటి ద్వారబంధానికీ అటూ ఇటూ గెలలు వేసిన అరటి చెట్లని కడుతూంటారు. ఇది చాల చక్కని అర్థవంతమైన విధానం. అలాగని అవకాశం లేనివివారు కూడా వ్యయ ప్రయాసల కోర్చి చేయాలని కాదు. విషయాన్ని గ్రహించకుండా ఉండవద్దని మనవి.

శుభానికి ప్రతీక అరటి. తల్లి చెట్టైన తనని ఒక గెలవేసాక కొట్టి వేస్తారని తెలిసి, ఆంతకు ఎంతో ముందుగానే పిలకలని పెట్టి తన వంశాభివృద్ధిని చేసుకుంటుంది అరటి. పెద్దగాలికి తాను విఱిగిపడినా సంతానానికి మాత్రం లోటు రానీయదు అరటి. వేడి అన్నాన్ని లేత అరటి ఆకులో పెట్టుకొని క్షణం ఆగిన పిమ్మట తింటే, ఈ ఆకులోని తేమని ఆ అన్నపు వేడి గ్రహించి, కఫాన్ని పెరగనీయదు. శరీరానికి నీటిని (వ్యాధి) చేరనీయదు. అందుకే పెద్దలు సజీవపత్రంలో అంటే ఎండిపోని ఆకులో అన్నం తినవలసిందన్నారు. ఎండిన ఆకుల విస్తరి వట్టి పళ్లెంగా పనిచేస్తుంది తప్ప ఔషధ గుణాన్ని అందించ(లే)దు.

చెట్లనీ, చెట్ల ఆకులనీ తక్కువ దృష్టితో చూడనే చూడకూడదని ప్రాచీనుల దృష్టి. అందుకే శ్రీమద్రామాయణంలో రాముణ్ణి వర్ణిస్తూ 'నివాస వృక్షః సాధూనామ్.. రాముడు చెట్టులాటివాడన్నాడు వాల్మీకి. వేగంగా వచ్చే గాలిని ఆపడం, దుర్వాయువుని తనలో లయం చేసుకోవడం, పరిశుభ్రమైన గాలిని విడుదలచేయడం, మేఘాలకి తగినంత గాలిని అందించి వర్షం కురిసేలా చేయడం, పక్షులకి తన కొమ్మలమీదా, జంతువులకి తన నీడలోనూ, తన వేరుభాగంలో ఎలకలూ మొదలైన వాటికీ నివాసాన్ని కలుగజేస్తుంది చెట్టు. ఆలా సర్వావయవ ప్రయోజకుడు రాముడని భావం. దీన్నిబట్టి చెట్టు గొప్పదనాన్ని పరోక్షంగా తెలుసుకోగలం. అంతేకాదు. ప్రతి వస్తువూ తన శక్తిని విడుదలచేస్తూ ఉంటుందని ప్రకృతివిజ్ఞానశాస్త్రం చెప్తోంది. చెట్టు తననుండి సహాయతా శక్తిని విడుదలచేస్తూంటుంది కాబట్టే మహర్షులంతా ఆ పరోపకార బుద్ధిగల చెట్లకింద విద్యాభ్యాసాన్నీ, తపస్సునీ చేస్తూంటారు. ఈ పండుగ ద్వారా ఈ విశేషం కూడా తెలుసుకోవీలౌతోందన్నమాట.

## రాబోయే పూజలో వాడబడే ఇరవైయొక్క పత్రాలూ - వైద్య రహస్యాలూ

ఇప్పటివరకూ కొన్ని కొన్ని పత్రాల్లో దాగి ఉన్న వైద్య విశేషాలని సూక్ష్మంగా గమనించుకున్నాం గదా! ఇప్పుడు ఇక మీదట రాబోయే ఇరవైయొక్క పత్రాల పూజ అంటే ఏకవింశతి పత్ర పూజలో పూజింపబడే ఇరవైయొక్క ఆకుల విశేషాలనీ వాటిలోని ఔషధ గుణాలనీ వివరంగా తెలుసుకుందాం.

| క్రమ సంఖ్య | పత్రంపేరు / ఆధునిక నామం | తెలుగు పేరు | ఏ వ్యాధిని నివారిస్తుంది? | ఎలా ఉపయోగించాలి? |
|---|---|---|---|---|
| 1. | మాచీ (ఆర్టిమిషియా వల్గరిస్) | మాచిపత్రి | నేత్రవ్యాధులు | ఆకుని తడిపి కళ్ళమీద ఉంచుకోవాలి |
| | | | చర్మ వ్యాధులు | పసుపూ నూనెతో నూరి ఒంటికి రాసుకోవాలి. |
| 2. | బృహతీ పత్రం (కంటకారి) | నేలమునగ (వాకుడు) | మూల శంక దగ్గు, మలబద్ధకం | నూరి నీటితో సేవించాలి. |
| 3. | బిల్వం | మారేడు | చక్కెర | రోజూ రెండు మూకులు ఆకులని నమిలి రసాన్ని నిదానంగా మింగాలి. కాయ లోని గుజ్జుని ఎండబెట్టి పొడి చేసి రోజూ మజ్జిగలో కొంత కొంతగా వేసుకుంటూ రావాలి. |
| 4. | దూర్వా యుగ్మం | జంటగరిక | మూత్రసంబంధ వ్యాధులు | పచ్చడి చేసుకుని తినాలి. |
| 5. | దుత్తూర (అస్ట్రామో నియం) | ఉమ్మెత్త | మానసిక రోగాలు | ఆకుల రసాన్ని తలని బోడిచేసి రెండు నెలలపాటు రోజూ మర్దన చేయాలి. |
| 6. | బదరీ | రేగు | బాల్య వ్యాధులు | మితంగా తింటే మంచిది. లేనిపక్షంలో శ్లేష్మం కలగజేస్తుంది. |
| 7. | అపామార్గ (ఎక్రాంతిస్) | ఉత్తరేణి | 1. దంతవ్యాధులు | ఈ కొమ్మపుల్లలతో పళ్లు తోముకోవాలి. |
| | | | 2. చర్మరోగాలు | ఆకులని నూరి రాయాలి. |

| క్రమ సంఖ్య | పత్రంపేరు / ఆధునిక నామం | తెలుగు పేరు | ఏ వ్యాధిని నివారిస్తుంది? | ఎలా ఉపయోగించాలి? |
|---|---|---|---|---|
| 8. | తులసి (ఓసియంకార్) (తుల్సీ) | తులసి | దగ్గు, వాంతులు నులిపురుగు | రోజూ 5, 6 ఆకులని మిరియం, ధనియంతో నూరి తినాలి. |
| 9. | చూత | మామిడి | 1. చర్మ రోగాలు 2. కాళ్లపగుళ్లు 3. అతిసారం | 1. మామిడి జిగురులో ఉప్పు కలిపి వేడిచేసి పగుళ్లకి రాయలి. 2. లేత మామిడాకులని పెరుగుతో నూరి తినాలి |
| 10. | కరవీర | గన్నేరు (ఓరియాండర్) | జ్వరతీవ్రత | పచ్చ-తెల్ల-ఎఱ్ఱ- ముద్ద- బిళ్ల.. ఏ జాతి గన్నేరు ఆకుల నైనా కొమ్మనుంచి తుంచి పాలు లేకుండా చూసుకుని ఒక తడి గుడ్డలో పెట్టుకుని శరీరానికి కట్టుకోవాలి. |
| 11. | విష్ణుక్రాంత | అవిసె | 1. చర్మవ్యాధి తామర 2. రక్తదోషం | 1. ఆకుల్ని నిమ్మరసంతో నూరి తామర ఉన్నచోట పూయాలి 2. ఆకుకూరగా వాడాలి. |
| 12. | దాడిమీ (గ్రెనేటం) | దానిమ్మ | 1. దగ్గు-ఉబ్బసం 2. అజీర్తి 3. కల్లవాపు | పొడిచేసి కషాయాన్ని కాచుకుని కొద్దిపాటి చక్కెరతో తాగాలి. ఆకుల్ని వేడిచేసి నూనెరాసి వాపు ఉన్నచోట కట్టాలి. |
| 13. | దేవదారు (ఒపిగానం) | దేవదారు | శ్వాసకోశ వ్యాధులు | దీని మానునుండి వచ్చే నూనెని వేడినీటిలో వేసుకుని స్నానం చేస్తూండాలి. ఆ ఘాటైన నూనెని వాసన చూస్తూండాలి. |
| 14. | మరువక | మరువం | శరీర దుర్వాసన | వేడినీటిలో వేసుకుని స్నానం చేయాలి. |
| 15. | సింధువార | వావిలి | బాలింతల వాతరోగం ఒంటి నొప్పులు | తెల్లనల్ల జాతుల్లో ఏదైనాసరే నీటిలో మరగబెట్టి ఆ నీటితో స్నానం చేయించాలి. |
| 16. | జాజి | జాజి | నోటి దుర్వాసన | ఆకులని వెన్నతో కలిపి నూరి పళ్లు తోముకోవాలి. |

| క్రమ సంఖ్య | పత్రంపేరు / ఆధునిక నామం | తెలుగు పేరు | ఏ వ్యాధిని నివారిస్తుంది? | ఎలా ఉపయోగించాలి? |
|---|---|---|---|---|
| 17. | శమీ | జమ్మి | 1. కుష్టు 2. స్త్రీలకి గడ్డాలూ మీసాలు | ఈ ఆకుల పసరుని ఆయా శరీర భాగాల్లో రాసుకోవాలి. |
| 18. | అశ్వత్థ (ఫీకస్ వెనోసా) | రావి | శ్వాసకోశ వ్యాధులు | ఎండిన రావి కట్టెలని నేతిని పోసి తగులబెట్టి ఆ భస్మాన్ని రోజా తేనెతో సేవించాలి. |
| 19. | అర్జున (అర్జున పత్ర) | మద్ది | వ్రణాలు | తెలుపు ఎరుపు జాతిలో వేటినైనా సరే నూరి వ్రణాలున్న భాగానికి కట్టాలి. |
| 20. | అర్క (కెలట్రపిన్) | జిల్లేడు | ముఖపు రంగు మార్పు | తెల్ల-ఎఱ్ఱ-రాజ' అనే పేరున్న వాటిలో ఏదైనా ఒక జాతి ఆకు పాలని పసుపులో కలిపి ముఖానికి రాసుకోవాలి. కంటికి తగిలితే చూపుపోతుంది. |
| 21. | నింబ | వేప | 1. కడుపులో నులిపురుగులు 2. చర్మరోగాలు | చిగుళ్ల రోజా తింటూండాలి. లేతాకులని పసుపుతో కలిపి నూరి ఉప్పుకలిపి రోజా తినాలి (ముఖ్యంగా వేసవిలో). |

ఈ పై అనుకున్న ఆకుల్లో ఈ ఓషధీగుణం ఉన్నమాట నూటికి నూటుపాళ్లా నిజమే. అయితే పైరుల ఎదుగుదల నిమిత్తం వాడబడే మందుల ప్రభావం ద్వారా - వాతావరణ కాలుష్యాన్ని సృష్టించే కర్మాగారాల ద్వారా - విజ్ఞానశాస్త్రం వీటిలో ఉన్న సహజశక్తిని కోల్పోయేలా చేసింది కాబట్టి, ఏ ఆకునైనా ఔషధంగా వాడదలిస్తే ఏదో రెండుమూడు రోజులు మాత్రమే వాడి, ఆ చెట్టుని నిందించి పది మందికి ఈ విషయాన్ని పనిగట్టుకుని ప్రచారం చేయడం మాని, చెప్పిన గడువుకంటె నాలుగైదురోజులు ఎక్కువే వాడి స్వస్థులు కావలసిందిగా ప్రార్థన. మనకి రక్షకుడైన మన పరమాత్మకి మనం 'స్వస్థులు' గా ఉండడమే కదా కావలసింది! అందుకే ఇరవైయొక్క పత్రాలతో తనకి, పూజ ఇష్టమన్నాడు. భగవంతుడిక్కూడా 'ఇవి ఇష్టం - అవి అనిష్టం' అంటూ ఉంటాయా? ఉండచ్చా? అని కొందఱు అంటూంటారు. పై వివరణంచూస్తే బాగా అర్థమయ్యేది ఒకటే 'మనకి ఏ అనారోగ్యమూ కలక్కపోవడమే ఆయనకి ఇష్టం' అని.

## 5. వేదాంత శాస్త్ర విశేషాలు

వెనకటికి ఒక సామెత ఉంది. పిల్లిని - అందునా నల్లని రంగుదాన్ని - అది కూడా చీకట్లో - ఇంతేకాక అసలు అక్కడ లేని దాన్ని వెతుకుతూంటే ఎంత సంతోషకరంగా ఉంటుందో వేదాంతాన్ని వింటూంటే అంత ఆనందదాయకంగానూ ఉంటుంది - అని. కొద్దిగా అర్థం చేసుకుంటే కష్టమన్పించదుగాని అర్థంచేసుకోలేనినాడూ- అర్థమయ్యేలా ఎదుటి వారు చెప్పకపోయిన నాడూ - వేదాంతం అందటికీ అర్థమైపోతే ఇక మన పాండిత్యమేమిటి? అనుకొని సరిగా చెప్పనప్పుడూ - పై సామెత నిజమన్పించక తప్పదు. అయితే కొద్దిగా ప్రయత్నిస్తే అర్థం కానిది ఏదీ ఉండదు. తెలియకపోతే మటోమాటు చదివి అర్థం చేసికొనేందుకు ప్రయత్నిద్దాం.

నేనే ఆ పరమాత్మను (జీవాత్మ పరమాత్మలకి భేదం లేదు - ఈ ఇద్దఱూ ఒకటే) అనే అభిప్రాయాన్ని కలిగి ఉండడమే అ-ద్వైతం (రెండు లేవు. సోహమ్ = ఆ పరమాత్మే నేను. నేనే ఆ పరమాత్మని అనే సంపూర్ణ భావంతో ఉండడం) ఆ వినాయకుని ఏకదంత విధానాన్ని గమనిస్తే "జీవాత్మ పరమాత్మ అనే రెండు తీరులు లేవనీ- ఉన్నది ఒకే ఒక్కటనీ - అది కూడా అ-ద్వైతమేననీ చెప్పడానికి సంకేతమే" అని స్పష్టంగా తెలుస్తుంది. ఇక భగ్నదంత విధానాన్ని గమనిస్తే (విఱిగిన దంతం) "ద్వైతం గూర్చి వాదించి ఓడిపోయి అ-ద్వైతమే గెల్చిందని చెప్పడానికి సంకేతమే" అని దృఢంగా అర్థమౌతుంది.

సమాధినా యోగినో గచ్ఛంతి యత్ర ఇతి గః - యస్మా ద్బింబవత్ ప్రతి బింబవత్తయా ప్రణాత్మకం జగ జ్జాయత ఇతి జః- యోగిపుంగవులంతా ఏ పరమాత్మని పొందుతూ ఉంటారో ఆ పరబ్రహ్మాన్ని 'గ' అన్నారు. ఏదో ఒక కారణమే కారణంగా, పుట్టే కార్యమైన ఈ ప్రపంచాన్ని, పుడుతోంది కాబట్టి, 'జ' అన్నారు. కార్యకారణ ఉభయరూపంగానూ తానే ఉంటాననే దానికి సంకేతమే ఈ గ + జ రూపం.

ప్రతివ్యక్తికీ జ్ఞానేంద్రియాలూ కర్మేంద్రియాలూ అనేవి వేఱు వేఱుగా ఉంటాయి. తలలో జ్ఞానేంద్రియాలు మాత్రమే ఉంటాయి. వినాయకుని తుండం మాత్రం ఆయనకి తలలో ఉన్న జ్ఞానేంద్రియాలతో పాటు ఉన్న కర్మేంద్రియం. జ్ఞానా దేవ 'వర్త ఏవ చ కర్మణి' అన్నట్లు ఈ తుండం (కర్మ) కూడ, జ్ఞానాన్ని పొందడంలో ఒక సాధనమే అని చెప్పడానికి సంకేతం.

ఆకాశా ద్వాయుః వాయో రగ్నిః . . . . అని పూర్వం అనుకున్నాం. ఇలా పంచభూతాలకీ ఆధారం ఆకాశం. (ఆకాశా దేవ ఖ ల్విమాని...) కాబట్టి లంబోదరం - ఈ సర్వభూతాలకీ ఆధారమైన ఆకాశానికి సంకేతం. మాయ నుండి సత్యతత్త్వాన్ని చెఱిగి మాయను పొల్లుగానూ, సత్యాన్ని యథార్థపదార్థంగానూ, నిర్ణయించి చెప్తాయనడానికి చేట చెవులు సంకేతాలు.

కుండలినీ శక్తిని పొందాలంటే మనం కూర్చున్నప్పుడు శరీరం నేలకి ఆనేచోట మూలాధార చక్రం ఉంటుంది. ఆ చక్రానికి కుడిచేతివైపు వినాయకుడూ, ఎడమవైపున సరస్వతీ ఉంటారు. వీరిద్దఱినీ సేవించకుండా కుండలినీ శక్తికి అవకాశమే లేదు. అందుకే తులసీదాసు (హిందీ కవి) అన్నాడు - మంగలానాం చ కర్తారౌ వందే వాణీ వినాయకౌ - అని. 'మూలాధార క్షేత్ర స్థితమ్' అని వాతాపి గణపతిం భజే అనే గురుగుహస్వామి కీర్తనలో కన్పిస్తుంది కూడ.

నలుగుమట్టితో వినాయకుణ్ణి సృష్టించడానికి కారణం, సృష్టి ఒక వికారమని చెప్పడానికీ - మూలాధారం పృథ్వీతత్త్వానికి సంబంధించినదే అని తెల్పడానికీనూ. మట్టివినాయకుణ్ణి పెట్టి పూజించడంలో అర్థం ఇదే. ఈ మూలాధారం నుండి కుండలిని ఉద్బుద్ధమై సహస్రారాన్ని చేరగానే 'శ్రీవాణి' విన్పిస్తుంది. అదే నాదం. ఆ నాదం నుండే అక్షరాలు. ఆ అక్షరాల నుండే వేదం. ఆ వేదం నుండే ప్రణవం. ఆ ప్రణవ స్వరూపమే ఓంకారం. ఆ ఓంకారమే వినాయకుడు. ప్రతి మంత్రానికీ ముందు 'ఓమ్' అని పలుకబడి తొలిపూజని అందుకునే తాను 'తొలి వాక్కు' అని సంకేతించడం కోసం. వేదాభ్యాస ప్రారంభంలోనూ - వేద పఠనారంభంలోనూ మహాగణాధిపతిధ్యానాని క్కారణం కూడా నాదం నుండి పుట్టిన వేదమే సర్వానికీ ఆద్యం కావడమే.

పృథివి - ఆప్ - తేజస్ - వాయు - ఆకాశాలు పంచభూతాలు కాగా పృథివి రంగు ఎఱుపు. ఆ పృథ్వీతత్త్వాన్ని తెలియజేయడానికే వినాయకుడు ఎఱ్ఱని రంగూ - ఎఱ్ఱని మాలికలూ - ఎఱ్ఱని వస్త్రాలూ - ఎఱ్ఱని గంధం - ఎఱ్ఱని పూల పూజాకలవాడయ్యాడు.

వ్యాకరణశాస్త్రం ప్రకారం దొంగిలించడమనే అర్థం కల 'ముష స్తేయే' ధాతువునుండి పుట్టినల్యుడంత పదం మూషకమనేది. భక్తుల హృదయమనే కన్నంలో నివసిస్తూ, నిరంతరం భక్తుల అజ్ఞానాన్ని దొంగిలించేది ఈ ఎలుక. దొంగతనం చేసినా

మూషకానికి పుణ్యమూ పాపమూ ఎలా అంటదో, అలాగే అందఱిలోనూ ఉండే పరమాత్మ కూడా, జీవాత్మతో పాటు అన్నిటినీ అనుభవిస్తూ కూడా పుణ్యపాపఫలాలు లేకుండా ఉంటాడనడానికి సంకేతం ఈ ఎలుక.

ఆత్మ స్వరూపాన్ని తెలియడం చాల కష్టం. వక్రం ఆత్మ రూపం ముఖం యస్య వక్రతుండః - అని విగ్రహం. ఆత్మ స్వరూపాన్ని తెలియడం అనేది చాల కష్టమైన విషయమనీ - అది మాటలకు చెప్పరానిదనీ - మిక్కిలి వంకరగా (సూటిగా లేక ఊహింప వీలులేక) ఉండేదనీ సూచించేందుకు సంకేతమే వక్రతుండం. అంతేకాదు. ఇది ఓంకారానికి కూడా సంకేతమంటారు.

ఇక ఆయననాల్గు చేతులూ - ధర్మార్థకామ మోక్షాలకీ - పరా పశ్యంతి మధ్యమా వైఖరీ వాక్కులకీ - ఋ గ్యజు స్సామా థర్వ వేదాలకీ - దేవ - అసుర - నర - నాగ జాతులకీ సంకేతాలు. సగం గజరూపంతోనూ - సగం నర రూపంతోనూ ఉన్న ఈ వినాయకరూపం - తత్ - త్వం అనే రెండు పదాలకీ 'అసి' అనే పదంలో కుదిరిన సమన్వయానికి సంకేతం - జీవాత్మ పరమాత్మలకి కూడా సమన్వయ బోధకం.

## 6. సంగీత శాస్త్ర విశేషాలు

వినాయకునికి సంగీతమంటే మఱింత ఇష్టం. పాట పాడే వ్యక్తి, తాను పలుకవలసిన అక్షరాన్ని ఎంత నాదశక్తితో ఎంతసేపు ఏ అక్షరాన్ని ఎంతటి గాలి ఒత్తిడితో ఎలా శ్రావ్యంగా పలికి ప్రజలని రంజింప చేయాలో ఆ శక్తిని 'సరస్వతి - గణపతి' అనే ఇద్దఱు మాత్రమే మూలాధార చక్రంలో అటూ ఇటూ ఉంటూ మనకి ఈయగలరు.

సరస్వతి భాషాపటిమని కల్గిస్తే, గణపతి పైన అనుకున్న తీరుగా నాదశక్తిని అందిస్తాడు. ఆ కారణంగానే సంగీతాన్ని ఆరంభించబోయే ప్రతి విద్యార్థీ 'మపదస సరిరిస (శ్రీ గణనాథ సిందూరవర్ణ...) అంటూ పాడక తప్పదు. ఆ మీదట గగపాపా ధపసాసా పిళ్లారి (వినాయక) గీతంలో నాదానికీ, మీది సరస్వతీ గీతంలో సాహిత్యానికీ భేదాన్ని గమనించవచ్చు.

అంతేకాదు. 'వాతాపి గణపతిం భజే' అనే గురుగుహ కీర్తనలో హంసధ్వని రాగం (సరస్వతీ సంబంధం) ఉండడం మఱింతగా గమనించదగిన అంశం.

ప్రతి సంగీత విద్వాంసుడూ కీర్తన ప్రారంభంలో తననా . . . . త . . న అని అంటూంటారు. నాదరూపమైన గణపతి శ్రీమహావిష్ణు స్వరూపుడు కాబట్టి ఒకప్పుడు అనంత . . . అనంత . . అని ఆలాపన చేస్తూండే వారని ఎక్కడో చదివిన గుర్తు బాగా ఉంది. కాలక్రమంలో అది తననా.. కు పరిమితమయ్యింది.

ఇలా అనేక శాస్త్ర రహస్యాలని వినాయకుని ద్వారా తెలిసికోగలం. ఇంతటి విశేషం కల గణపతి అసలు ఎన్ని భేదాలుగా మనకి కన్పిస్తాడో (ఎందఱు గణపతులో) ఆ సంఖ్యనీ వివరాలనీ చూద్దాం.

## గణపతులు ఎందఱు?
## 21 పత్రాలతోనే పూజ ఎందుకు?

మనం మామూలుగా వింటూన్నదీ చూస్తూన్నదీ ఒక్క వినాయకుణ్ణే. కాని ఈ పండుగ రోజుల్లో మార్గాల ప్రక్కన ఎందఱెందఱో గణపతి విగ్రహాలని చిత్రవిచిత్రంగా అనేకాకారాలతో చేస్తూ కన్పిస్తారు. అవి నిజమైన విగ్రహాలేనా? తీరా పూజిస్తే ఏదైనా అరిష్టం కలుగుతుందా? అని అన్పించవచ్చు. చాల మటుకు నిజమైన విగ్రహాలే. చాల మంది ఆ విగ్రహాలని తమ తండ్రి తాతల సంప్రదాయ ధోరణిలో అతినిష్ఠతోనే చేస్తారు తప్ప, యాథాలాపంగా, అనిష్టంతోమా విగ్రహాలని చేయరు.

కొద్ది పరిశీలన చేస్తేమటొక ఆకారంతో, ఆయుధాలతో కన్పించే వినాయక విగ్రహానికి ఆధారం ఎక్కడో లభించక మానదు. ఒక విధంగా అలాటి విగ్రహం మన కంటబడి మనని కొంత పరిశీలింపజేస్తుందన్నమాట. అంతేకాదు. అలా విచిత్రమైన విధంగా చిత్రించబడిన వినాయకుని రూపంబట్టి ఆ చిత్రించినవారి కాలాన్ని కూడా గ్రహించవచ్చునన్నమాట.

అలాగే విగ్రహాన్ని ప్రతిష్ఠించేవారు కూడా అతి శ్రద్ధతో, మంత్రమననాన్నీ పారాయణాన్నీ చేసి ప్రతిష్ఠిస్తారే తప్ప ఏదోలా ప్రతిష్ఠించనే ప్రతిష్ఠించరు. విగ్రహం అంతా అయ్యాక కండ్లని అమరుస్తారు. అలాగే ప్రతిష్ఠ మొత్తం అయ్యాక విగ్రహపు కళ్లకే ఉన్న మైనపు ముద్దని మంత్రాలని మఱింతగా చదువుతూ తొలిగించి ఆయన దృష్టి పడకుండా ప్రక్కగా నిలబడతారు. ఎదురుగా నిలబడరు. ఇలా ఎన్నెన్నో ఆసక్తికరమైన అంశాలున్నాయి.

ఇంతకీ గణపతులసంఖ్య ఈ క్రింది ప్రకారం 32. వీరిలో ప్రధాన గణపతుల సంఖ్య 21. ఆ 21 గణపతులకీ పూజ చేయడం కోసమే 21 పత్రులతో పూజని చేసి, ఆయన ద్వారానే ఆ 21 మందిలో భేదాలుగా ఉన్న మరో 11 మందిని కలిపి మొత్తం 32 మందికీ పూజని చేస్తామన్న మాట. దీనిని బట్టి ఒక్కతీరు ఈ వినాయకునికే పూజని చేసానుగాని మిగిలిన 31 మందికీ చేయలేదే అని బాధపడనవసరం లేదన్నమాట.

గణపతి

1) శ్రీ — వీర — శక్తి 3

భక్త బాల తరుణ — ఉచ్ఛిష్ట ఉన్మత్త — విద్యా దుర్గ విజయ 8

2) వృత్త - విఘ్న - లక్ష్మీ - నృత్త - నృత్య - మహా - బీజ - ఢుంఢి 8

3) పింగళ - హరిద్రా - ప్రసన్న - వాతాపి - హేరంబ 5

త్ర్యక్షర త్రిముఖ ఏకాక్షర 3

4) వక్రతుండ - వరసిద్ధి - చింతామణి - సంకష్టహర - త్రైలోక్యమోహన 5

అవాంతర భేద గణపతులు 11 + ప్రధాన గణపతులు 21 = 32

మొత్తం గణపతుల సంఖ్య 32. (వీరి రూపాలూ ఆయుధాలు ఇలా అన్నింటినీ వివరించాలని ఉంది గాని, ఇది ఉపన్యాసం కాదు. అచ్చు పుస్తకం గదా! మన్నించాలి.)

వినాయకుడు విష్ణురూపమే అనుకున్నాం గదా! శ్రీమద్భాగవతం ప్రకారం శ్రీమహావిష్ణువు అవతారాలు చూస్తే మొత్తం 21. (సుయజ్ఞ - కపిల - దత్తాత్రేయ - సనకాది చతుష్టయ - నరనారాయణ - ధ్రువ - పృథు - వృషభ - హయగ్రీవ - మత్స్య - కూర్మ - నృసింహ - ఆదిమూల - వామన - మను - ధన్వంతరి - పరశురామ - శ్రీరామ - కృష్ణ - బుద్ధ - కల్కి) ఇదుగో ఈ గణపతులలో ప్రధానులు 21 అనుకున్నట్టుగా ఆ 21 శ్రీహరి అవతారాల్లోనూ ప్రధానమైనవి 10 కాబట్టి, ఇవే దశావతారాలుగా లోకంలో ప్రచారమయ్యాయి.

ఇక శివకేశవులకి భేదం లేదనుకునే దృష్టితో కూడ దీన్ని ఆలోచించవచ్చు. శ్రీహరి అవతారాలు పదింటినీ ఏకాదశ రుద్రులసంఖ్య 11తో కలిపితే 21 అవుతుంది.

కాబట్టి విష్ణువు అవతారాల్లోని ఒక్కొక్క మూర్తినీ ఒక్కొక్క గణపతిగా భావించి, అలా 21 మూర్తులకీ పూజచేయడం కూడ పత్రిపూజలోని విశేషమన్నమాట.

## వినాయకుని తెలివితేటలని గూర్చి ప్రచారంలో ఉన్న కథలు

### 1. కాకిరూపంలో గణపతి

సప్త మహర్షులలో ఒకడైన అగస్త్యమహర్షి ఒకసారి కోపించి కావేరీనదీ జాలాలని తన కమండలువులో కావాలని బంధించి వేసాడు. ప్రజలంతా నీరు లేక కటకటలాడసాగారు. చేసేది లేక ఇంద్రుడు గణపతిని ప్రార్థించాడు.

నేర్పరితనంతో కాకి రూపాన్ని ధరించి కమండలువులోని నీటిని త్రాగే కాకిలా నటిస్తూ నటిస్తూ గణపతి, ఒక్కసారి ఆ కమండలువుని దొర్లించి ఎగిరిపోయాడు. మళ్లీ కావేరీనది యథా ప్రకారంగా ప్రవహించసాగింది. అగస్త్యునికి విషయం అర్థమై గణపతిని స్తుతించాడు. తప్పిదాన్ని తెలిసికొన్నాడు. (ఇది తమిళనాడు ప్రాంతంలో బాగా ప్రచారంలో ఉన్న కథ)

### 2. బ్రహ్మచారిరూపంలో గణపతి

ఒక్కప్పుడు శివభక్తాగ్రేసరుడైన రావణుడు సామగానాన్ని పరమ శ్రావ్యంగా చేసి శంకరుణ్ణి మెప్పించాడు. బోళాశంకరుడు వరం కోరుకొమ్మనగానే రావణుడు శంకరుని ఆత్మలింగాన్నే (శంకరుడే ఒక లింగరూపమై ఉండడం) అడిగాడు. రావణుని చేతిలోనికి శివుడు తాను ఆత్మలింగ రూపంగా వెడుతూ 'రావణా'! నీకీ వరమిచ్చాను గాని ఒక్క విషయం విను. నేను నా వరానికి కట్టుబడి నీ వెంట వస్తున్నాను. అయితే అతి ముఖ్యమైన ఆత్మలింగపు నియమం ప్రకారం దీన్ని నువ్వు నేలమీద పెట్టావా! ఆ ప్రదేశంలోనే నేను శాశ్వతంగా ప్రతిష్ఠింపబడిపోతాను. చాల ప్రమాదం. గుర్తుంచుకోసుమా!' అన్నాడు. అహంకారంతో నవ్వుతూ రావణుడు 'అలాగే!' అన్నట్లు కళ్లెగుర వేసాడు.

పార్వతి ఈ విషయాన్ని తన పుత్రుడైన గణపతికి చెప్పింది. వెంటనే బ్రహ్మచారి వేషంలో బయలుదేరి వెళ్లిన వినాయకుడు, సముద్రపు ఒడ్డున రావణుడు వస్తూన్న త్రోవని గమనించి ఒకచోట నిలబడ్డాడు. సాయంత్రం కాగానే సంధ్యాకాలంలో

నిత్యనియమంగా సంధ్యావందనాన్నిచేసే రావణుడు, తన అరచేతులలో ఉన్న ఆత్మలింగాన్ని ఎక్కడుంచి సంధ్యావందనం చేయాలా? అని ఆలోచిస్తూ ఈ బ్రహ్మచారిని గమనించి ప్రార్థించాడు.

గణపతి కూడ అంగీకరిస్తూ 'రావణా! నేనా బ్రహ్మచారిని! నువ్వా మహా బలవంతుడివి. ఈ ఆత్మలింగాన్ని నేనేం మొయ్యగలను'? అన్నాడు బెట్టు చేస్తూ.

కర్మిష్ఠి అయిన రావణుడు నిత్య నియమంగా అన్ని శాస్త్రోక్తకర్మలనీ సకాలంలో చేసే లక్షణం ఉన్నవాడు కాబట్టి నియమభంగాన్ని చేయలేక, సాయంకాలపు సంధ్యావందనాన్ని తప్పక చేయవలసి గణపతితో ఒక ఒప్పందానికి వచ్చాడు.

ఆ నియమం ప్రకారం - శివలింగం బరువయిందనిపించినప్పుడు గణపతి మూడుమాటులు రావణుణ్ణి పిలవాలి. మూడవపిలుపు పూర్తి అయిన వెంటనే వచ్చి రావణుడు వినాయకునినుండి ఆత్మ లింగాన్ని తీసుకోవాలి. దీనికి లోబడ్డ రావణుడు సంధ్యావందనాన్ని అతినిష్ఠతో ప్రారంభించాడు.

అంతే! గణపతి ఒకమాటు కేకవేయనే వేసాడు - 'బరువుగా ఉందనీ - వచ్చి తీసికోవలసిందనీ'ను. ఇంకా అర్ఘ్యం ఈయడం కూడా పూర్తికాని రావణుడు గణపతి తొందరని గమనించి కూడా నిస్పృహాయంగా ఉండి తన కర్మలోనే మునిగిపోయాడు.

మళ్లీ రెండో మాటు పిలిచాడు గణపతి. మూడోమాటు పిలుస్తాడనే భయంతో తొందరతొందరగా కర్మ ముగించుకొని బయలుదేరాడు రావణుడు.

అది గమనించిన గణపతి మఱింత వేగంగా రమ్మని పలుకుతూ బరువు మోయలేని వాడిలా నటిస్తూ ఆత్మలింగాన్ని నేలమీద పెట్టనే పెట్టేసాడు గణపతి. రావణుడు చాల నిరాశ పడ్డాడు. గణపతి లోలోపల ఆనందపడ్డాడు. పార్వతి సంతోషించింది. దేవతలు వినాయకుని తెలివిని అభినందించారు.

ఈ కథని వినేసరికి గణపతి ఏదో మోసం చేసినట్లుగా భావిస్తారు తప్ప, రావణుడు అలాటి వరాన్ని అడగడం అధర్మమని మాత్రం ఆలోచించరు. శఠే శాఠ్యం సమాచరేత్ -ముల్లుని ముల్లుతోనే తియ్యాలనేది ఇక్కడి రహస్యం. అయితే అదికూడ అసలు రహస్యం కానేకాదు. 'శంకరుని ఆత్మలింగాన్ని పట్టుకొని నిలువగలిగినంతటి శక్తి గల ఈ బ్రహ్మచారి ఎవడై ఉంటాడా?' అని ఆలోచింప (లే)ని అవివేకం రావణునిది తప్ప, దోషం ఆ గణపతిది కానేకాదు.

## 3. లలితాసహస్రనామాల్లో గణపతి

కామేశ్వర ముఖాలోక కల్పిత శ్రీ గణేశ్వరా! - మహా గణేశ నిర్భిన్న విఘ్న యంత్రప్రహర్షితా!! అనేవి కూడా లలితకు సంబంధించిన వేయింటిలో ఉన్నాయి. ఆ శంకరుని ముఖాన్ని పార్వతి అలా చూడగానే, తనకు గణేశ్వరుడు జన్మించాడని పై శ్లోకంలోని ప్రథమపాదపు భావం.

ఇంతకు ముందు మనం వ్యవసాయ విశేషాలలో అనుకొన్న తీరుగా భూమి అయిన పార్వతి, శంకరుని వలన నీళ్లాడి గణేశ్వరుణ్ణి (సస్యాన్ని) కంది. కాని ఇక్కడ అర్థం అది కాదు. కామేశ్వరుడంటే రూపం ఏమాత్రమూ లేని నిర్గుణ శివుడు. ఆయన ముఖాన్ని పార్వతి చూడగానే - అంటే - శివుని తత్వాన్ని ఆమె స్పష్టంగా తెలుసుకోగానే గణేశ సృష్టి జరిగిందని దీని భావమన్నమాట.

ఒకప్పుడు లలితాదేవి భండాసురునితో యుద్ధం ప్రారంభించింది. వారి సేనాధిపతి విశుక్రుడు. వాడు 'జయవిఘ్న యంత్రం' సహాయంతో లలితాంబపైకి యుద్ధానికి వచ్చాడు. ఆమె కూడా తనవద్ద ఉన్న 'విఘ్ననాశనమంత్రం'తో మహాగణపతిని ప్రేరేపించింది. విశుక్రుణ్ణి వధించింది. దీన్నిబట్టి అక్షరాలని మంత్రరూపంగా, సరైనవ్యక్తి నుండి స్వీకరిస్తే, మంత్రశక్తి - యంత్రశక్తిని మించిపోతుందనే విషయం స్పష్టమౌతోంది గదా! అదీకాక గణపతికి తన తల్లి అండదండలు ఎల్లవేళలా ఉంటాయనీ తెలుస్తోంది గదా!

అందుకే అమ్మవారికి ఇష్టమైన తీరుగానే ఈయన కూడా - రక్తవర్ణం - రక్తమాల్యాంబరధరం - రక్తగంధానులిప్తాంగం - రక్తపుష్పైస్సుపూజితం - ఎఱ్ఱని మాలికలూ, ఎఱ్ఱని వస్త్రాలూ... ఇలా ఎఱ్ఱనివాటినే తనకి ఇష్టమైన వాటినిగా స్వీకరించాడు. కాబట్టి గణపతిని సేవించడమంటే అమ్మఒడిలోనికి నేరుగా వెళ్లి చేరడమే నన్నమాట.

ఇక అయ్యవారైన శంకరుని మాట చెప్పాలా? క్రీత స్తపోభిః - తవాస్మి దాసః --- ' ఓపార్వతీ! నువ్వు చేసిన తపస్సుతో నన్ను కొనేసి, నా అంతట నేనే నీకుగా అమ్ముడు పోయేలా చేసావు. అందుకే నేను చెపుతున్నాను - ఇక్కడి నుండి నీ దాసుణ్ణి - అన్నాడాయన. పార్వతికి దాసుడు శంకరుడు. పార్వతికి ఇష్టుడు గణపతి. కాబట్టి గణపతిని పూజించడమంటే శివ శక్తి సమ్మేళనాన్ని సంతోష పెట్టడమన్నమాటే.

తం్రడిలా నిరాడంబరత ఉన్న కారణంగానే జిల్లేడు - ఉమ్మెత్త - ... మొదలైన ఎవరూ స్వీకరించని పత్రాలని తాను స్వీకరించాడు. తల్లిలా ధైర్యసాహసోపాయాలు ఉన్నాయి కాబట్టే, రావణుడులాటి రాక్షసులకి సరైన సమాధానం చెప్పాడు. పైన అనుకున్నట్టుగా కాకిరూపం లోనూ - బ్రహ్మచారి రూపంలోనూ - విశుక్రుని వధలోనూ కార్యసాధన చేసాడు. ఇలా బుద్ధి వైభవంతో ఎదుటివారిని గెలవడమనేదానికి కారణం ఈయన విష్ణువు కావడమే.

## 4) విఱిగిన దంతం వెనుక దాగిన రహస్యం........?

సంస్కృతంలో 'మాఘుడు' అనే ఒక మహాకవి శిశుపాలవధ మనే మహాకావ్యాన్ని రాస్తూ 'రావణుడు విఱిచిన ఆ వినాయకుని మఱో దంతం తిరిగి పెరగనే లేదు సుమా!' అన్నాడు (న జాతు వైనాయక మేక ముద్ధృతం విషాణ మ ద్యాపి పునః ప్రరోహతి). కాని ఇది ఎందుకో ఔచిత్యవంతంగా అన్పించదు.

వేఱే కథ ఒకటి లోకంలో ప్రచారంలో ఉంది. 'భారతః పంచమో వేదః' నాలుగు వేదాలతో సమానంగా వేదాలలోని విషయాలనే ఒక కథారూపంలో అందించదలిచిన వ్యాసుడు భారతమనే ఒక గ్రంథాన్ని వ్రాయాలనుకున్నాడు. అయితే తాను చెప్తూంటే అలా వ్రాసుకుంటూ పోగల సమర్థుడు లేక పోవడం కొంత అసౌకర్య మన్పించింది వ్యాసునికి. ఇంతలో గణపతి ప్రత్యక్షమయ్యాడు.

వ్యాసుడు గణపతిని ప్రార్థించాడు. 'బాల గణపతీ! నువ్వు సర్వజ్ఞుడివి కదా! నేను భారత గ్రంథాన్ని అప్పటికప్పుడు ఆలోచించి అలా ఆశువుగా చెప్పేయడం చేస్తాను. ఆ భారతాన్ని నువ్వు వ్రాస్తే నీ పేరూ - నా పేరూ కూడా జగత్ప్రసిద్ధాలవుతాయి' అని. ఎందఱికో ధర్మామృతాన్ని ఊరికే పంచగల శక్తి ఉన్న భారత గ్రంథాన్ని వ్రాయ వలసిందని ప్రార్థిస్తే 'అది తక్కువదనమౌతుందా?' అని వ్యాసుడూ - 'ఎవరో చెప్తూంటే నేను వ్రాసేవాడిగా ఉండాలా?' అని గణపతీ - కొంత తర్జన భర్జన పడి చివరికి ఓ నియమానికి కట్టుబడి రచన ప్రారంభించారు.

"వ్యాసుడు ఎక్కడా కూడా తన కవితాధారని ఆపకుండా అలా చెప్తూనే వెళ్లాలి. ఎక్కడ వ్యాసుని కవితా వేగం తగ్గి వినాయకుని ఘంటం ఆగిపోయినా, ఇక అక్కడితో వినాయకుడు స్వస్తి చెప్పి వెళ్లిపోతాడు. మఱి వ్రాయడు - ఇది గణపతి నిర్ణయం.

"వ్యాసుడు చెప్పిన ప్రత్యక్షరాన్నీ అర్థం చేసుకుంటూనే వ్రాయాలి గణపతి - ఇది వ్యాసుని నియమం.

ఎంత చక్కగా ఉందో గమనించండి! పరోక్షంగా శ్రీమన్మహాభారతం గొప్పదనాన్ని ఈ ఉపాఖ్యానం (కథ) చెప్తోందన్నమాట. దీన్ని బట్టి వ్యాసుని కవితావేగమూ - వినాయకుడంతటి వాడు కూడా అర్థం చేసుకుంటూ ప్రత్యక్షరాన్నీ చూచి వ్రాసిన విధానమూ - భారతంలో ఉన్నాయంటే నిజంగా భారత గ్రంథాన్ని ఒక్కమాత్రైనా పూర్తిగా చదవకపోతే భారతీయులం అని అనుకొనే అర్హత మనకి ఉందా? ఆలోచించుకోవాలి.

ఇలా నిర్ణయం చేసుకున్నాక గణపతి తనకు తానే తన దంతాన్ని పెకలించి వ్రాయసకాడుగా వ్యాసునికి ముందు కూర్చుని వ్రాతకి ఉపక్రమించాడట. అందుకే దంతమే ఘంటంగా ఆయన చేతిలో కన్పిస్తూంటుంది. అయితే ఇక్కడ మరో రహస్యమూ ఉంది.

హనుమంతుడు అనే మాటకి 'మంచి దౌడలు కలవాడు' అని పైకి తోచే అర్థం. పలుకబడే ప్రతి అక్షరం అతిస్పష్టంగా, అర్థవంతంగా, శ్రావ్యంగా ఉండడానికి ఉపకరించేవి హనువులు (దౌడలు). అలాగే వినాయకునికీ 'దంతి' అనే పేరుంది. 'దంతాలు కలవాడు' అని దీని అర్థం. దంతాలు ఎవరికి లేవు గనుక? కాబట్టి లో అర్థం అది కాదన్నమాట. దంతాలు లేకపోతే వినిపించే మాటలోని అక్షరాలలో స్పష్టత అసలు ఉండనే ఉండదు. ఆ కారణంగా పలుకబడే మంత్రం పట్టీయదు కూడ. దంతాలు ఊడిపోయిన సందర్భంలో ఉపాసనపరులు ఉపాంశుజపం (లోలోపలే మంత్రమననాన్ని చేసికోవడం) చేస్తారు. కాబట్టి మంత్రం పట్టిచ్చేలాగా చేయగలిగినది దంతమన్నమాట.

అలాటి దంతాన్ని విఱిచి తనకు తానై భారతాన్ని వ్రాయదలిచాడంటే పరోక్షంగా తన మంత్ర శక్తిని కూడా భారతంలో ప్రవేశపెట్టదలిచాడన్నమాటేకదా! ఇంతకీ దంతభంగమైతే మంత్రం పట్టీయకపోతే వినాయకుడు ఇక ఆమీదటి కాలంలో మంత్రాలని ఉపాసించనే లేదా? అని వితండవాదం చేయకూడదు.

తన దంతభంగమనేది తన మంత్రదీక్షకి విఘ్నాన్ని కల్గించేది అవుతుందనే ఆలోచనే వినాయకునికి ఉండి ఉంటే, తన దంతాన్ని తానే విఱుచుకుని ఉండేవాడా?

అన్నాన్ని నమలడానికీ, మాట్లాడే మాట స్పష్టంగా ఉండడానికీ మాత్రమే ఉపయోగించే మన దంతాలవంటివి వినాయకునివి కావు కదా. సంఖ్యలో ఎక్కువగా ఉండి (32), ఊడితే ఎందుకూ కొఱగానివి మన దంతాలు. ఉన్నవే రెండైతే ఆ రెంటిలో ఒకటి భారత రచనానికి ఘంటంగా ఉపయోగించింది ఆయన దంతం. అందుచేత మన దంతాల పోలికతో ఆయన దంతాలని గూర్చి వాదం చేస్తే అది వితండ వాదమే అవుతుంది.

## 5) వీధి శూల ఉన్న ఇళ్లకి వినాయకుని బొమ్మే ఎందుకు ఉంచుతారు?

ముద్గల స్కాంద పురాణాలలో ఉన్న కథ యిది. అభినందనుడనే రాజు ఒకసారి యాగాన్ని ప్రారంభించాడు. ఏ యాగాన్ని ప్రారంభించినా ఇంద్రునికి అందులో హవిర్భాగాన్ని (మంత్రాలు చదువుతూ అగ్నిహోత్రంలో వేసే నేయి) ఇచ్చి తీరాలి. కాని ఆ రాజు 'ఏమైనా సరే!' అనే అభిప్రాయంతో కావాలనే ఇంద్రునికి తప్ప అందఱికీ హవిర్భాగాలని ఈయడం ప్రారంభించాడు. దేవలోకపు నియమాలు పాటింపజేయడమే అతని కర్తవ్యమైన ఇంద్రుడు, విఘ్నాసురుని రూపంలో కాలపురుషుణ్ణి పంపి 'యాగాన్ని ఆపు చేయించవలసిం'దని ఆజ్ఞ చేసాడు.

దైవానికే ఆలయాన్ని కట్టదలచినా కూడా, దాన్ని మార్గమధ్యంలో కడుతూంటే, దానిని ఆపు చేయించవలసిన అధికారిగా తానే ఉంటే, తాను ఆపు చేయిస్తే అది దోషం కాదు. అలాటిదే ఇంద్రుడు చేసిన పని కూడా. పై ఉదాహరణలో లౌకికుడైన ఉద్యోగికి ఆ దైవం తనకి మఱింతగా ఆరాధ్యుడే అయినా, ఉద్యోగబాధ్యత ప్రకారం కట్టబడే దేవాలయాన్ని ఆపుచేయించవలసి ఉంది కాబట్టి, అతణ్ణి ప్రశంసించవలసిందే! ఇదీ అంతే!

ఇంతకీ కాలపురుషుడు యజ్ఞ ధ్వంసం చేయనే చేసాడు. ఆ మీదటి కాలంలో గణపతి ఈ విఘ్నాసురుడనే కాలపురుషుణ్ణి ధ్వంసం చేసాడుట. ఇదీ పైకథ. లోభావాన్ని చూద్దాం.

ఏం తప్పు చేసాడని విఘ్నాసురుణ్ణి మన గణపతి సంహరించవలసి వచ్చిందని పై దృష్టితో చూస్తే అనిపిస్తుంది? కాని ఇక్కడే రహస్యం ఉంది. మంచి - చెడు భేదం గమనించక విఘ్నాలని కల్గించడమే విఘ్నాసురుని పని కాసాగింది. మఱింతగా ప్రపంచానికి కష్టాలని కల్గించి ఎదుటివారి నేర్పరితనాన్ని చెడగొట్టడమే విఘ్నమంటే.

(విశేషేణ జగత్సామర్థ్యం హంతీతి విఘ్నః). ఇలా ఈ విఘ్నాసురుడు తనకి ఒకప్పుడు మాత్రమే అప్పజెప్పిన పనిని సాకుగా తీసికొని జగత్తుని సృష్టిచేసే బ్రహ్మాదులకి కూడా అడ్డుపడసాగాడు. అందుకని ఆ విఘ్నాసురుణ్ణి సంహరించాడు గణపతి.

ఇలా తానే చేయడానికి కారణం కూడ ఒకటుంది. ఒకప్పుడు గణపతి విఘ్నాలని మాత్రమే చేసే సామర్థ్యం కలిగి ఉండేవాడు. లోగడ గణపతి భేదాలని పరిశీలించండి. వారిలో 'విఘ్న గణపతి' అని ఒకాయన ఉన్నాడు. ఆయనే ఈయన.

"21 మంది గణపతులకీ 21 పత్రాలతో పుష్పాలతో పూజ చేయబోతున్నాం గదా! ఆ 21 మందిలో ఈ విఘ్నగణపతి కూడా ఒకడు గదా! విఘ్నాలని ఈయడమే ఈయన పనైతే, మనం ధ్యానించగానే ఆనందపడి ఓ నాలుగు విఘ్నాలని దయచేస్తే మన బ్రతుకు.....?" అన్పించవచ్చు. 'నా జోలికి రాకు స్వామీ!' అని ఈయనకి పూజచేస్తామన్నమాట.

తరవాతి కాలంలో అమ్మ అయిన పార్వతి ఈయనకి గణాధిపత్యాన్ని ఇప్పించాక విఘ్నాలని మాత్రమే చేస్తూండే తన విధానాన్ని మానుకుని, విఘ్నరక్షణని కూడ చేసే సామర్థ్యం కలవాడయ్యా డీయన. ఇప్పుడీయన పేరు 'వరసిద్ధి వినాయకుడు' అని.

లోకంలో కొందఱికి దణ్ణం అనుగ్రహించవలసిందనీ, మఱికొందఱికి దణ్ణం 'మా జోలికి రాకుండా ఉండవలసిందనీ' చేయడం లేదా? నేటి ఈ పద్ధతి, ఆనాటి సంప్రదాయమే నన్నమాట. అందుకే చమత్కారమే అయినా అర్థవంతమైన ఓ శ్లోకం ఉంది.

**భూనాయకం వా ధననాయకం వా భజ న్నృపం వా ధన మేతి లోకే!**

**తం విఘ్ననాథం న భజామి కింతు సహస్రశ స్తం ప్రణమామి నిత్యమ్॥** అని.

భూనాయకుణ్ణి - అంటే బాగా భూమి ఉన్న వారిని ప్రార్థిస్తే కొంత భూమిని దానమిస్తారు. ధననాయకుణ్ణి - అంటే ధనవంతుల్ని ప్రార్థిస్తే ధనమిస్తారు. విఘ్ననాయకుణ్ణి పూజిస్తే అంతకంటేవా? .... అని నాలుగు విఘ్నాలని ఇస్తాడు కాబట్టి ప్రార్థించనే ప్రార్థించను. వేలకొలదీ దణ్ణాలు పెడతాను' అని ఒక భక్తుడంటున్నాడని దీని భావం.

ఈ వేల దణ్ణాలూ కూడా 'తన మీదికి ఆయన దృష్టిని ప్రసరింపచేయవ'ద్దని. శనీశ్వరునికి అభిషేకం చేసేదీ ఇందుకే. కష్టాన్ని మనకి కల్గిస్తున్నప్పుడు ఇతర గ్రహాలకి కూడా జపాలు చేయించేది ఇందుకే గదా!

అందుకని అలాటి విఘ్నాసురుణ్ణి సంహరించి ఈ గణపతి అవిఘ్నాలని (కార్య సాఫల్యాన్ని) ఈయగలడన్న మాట. 'మహాగణేశ నిర్భిన్న విఘ్నయంత్ర ప్రహర్షితా!' అనే లలితాసహస్రనామం ఈ విషయాన్నే తెలియచేస్తోందని లోగడ అనుకున్నాం. విఘ్నం చేసే రాక్షసుణ్ణి వధించడానికి విఘ్నఘ్నుడు (విఘ్నాన్ని నాశనం చేసేవాడు) అయిన గణపతిని అమ్మవారు పంపి వాణ్ణి వధింపచేసి సంతోషించిందని దాని భావం.

శుభ కార్యాలకి ఎవరినైనా ఆహ్వానిస్తూ మనం ఆ ఆహ్వాన శుభపత్రికల పైన 'శ్రీరస్తు - శుభమస్తు - అవిఘ్నమస్తు' అని వ్రాయడానికి కారణం విఘ్ననాయకునికి దణ్ణం పెట్టామనీ - కోరుకున్న కోరికని తీర్చే వరసిద్ధివినాయకుణ్ణి ప్రార్థిస్తున్నామనీ - మహాగణాధిపతిని పూజించనిదే వరసిద్ధి వినాయకుడు పలుకడు గాబట్టి ఆ మహా గణాధిపతిని కూడా ముందుగానే పూజించి ఉన్నామనీ - ఈ మూటిని తెలియచేస్తూ వ్రాసేవే ఈ మూడూను.

సృష్టి - స్థితి - లయాలనేవి మూడు. బ్రహ్మ సృష్టిస్తే, ఆపదలు రాకుండా విష్ణువు రక్షిస్తే, కాలం తీరిన క్షణంలో లయం చేసేవాడు శంకరుడు గదా! రాజవీధికి ఎదురుగా ఏ విధమైన అడ్డూ లేకుండా ఉన్న ఇంటిని వీధిశూల ఉన్న ఇల్లు అంటారు. అలా వీధిశూల ఉన్న ఇంటి గోడపై వినాయకుణ్ణి చిత్రించడం లేదా విగ్రహాన్ని ప్రతిష్ఠించడం అంటే - జనుల దృష్టి ఆయన మీద పడాలనీ దిష్టి బొమ్మలా ఈయన ఉండాలనీ చెప్పడానికి కానేకాదు.

తప్పనిసరి పరిస్థితులలోనే ఈ చోటులో ఉంటున్నారు కాబట్టి, ఈ ఇంటిలో ఉన్న జనులని - "ఓ విష్ణురూపుడవైన గణపతీ! నీ దైన 'స్థితి' (రక్షించడం) అనే లక్షణంతో నిరంతరమూ రక్షిస్తూ ఉండు" అని ప్రార్థించడానికి సంకేతమన్నమాట.

భక్తితో కంటె భయంతో మా ప్రార్థన అంటూ ఇంకొక చక్కని పద్యం.

**కోరికల కడ్డు తగిలెడి వారిలోన వఱతి గావున ని న్వేడవలసి వచ్చె**

**అడ్డు తగిలెడి వా డెక్కు డైన యప్డు వేడుకొన కేమి చేయుదు విఘ్ననాథ!**

'గణపతీ! కోరిన కోరికలకి అడ్డుపడడంలో నీకు మించిన మహానుభావుడు లేడయ్యా! అడ్డు తగిలేవాడు మాకంటె బలవంతుడైనప్పుడు ప్రార్థించకుండా ఏం చేస్తాం!' అంటూ లోపల భక్తి నిండిన చమత్కార పద్యం ఇది.

ఇక్కడికి వినాయకుణ్ణి గూర్చి తెలుసుకోవలసిన కొన్ని విశేషాలని తెలిసికోవడం

జరిగింది గదా! ఇక అలాటి వినాయకుని పూజకి ఏయే వస్తువులు కావాలో ఒక్కసారి సిద్ధం చేసుకుని, అవకాశం ఉన్నంతవరకూ మంత్రాలకి అర్థం తెలిసికొని భక్తి శ్రద్ధలతో పూజ చేద్దాం.

## వినాయక పూజకి కావలసిన మొత్తం వస్తువుల జాబితా

పసుపు - కుంకుమ - వినాయక ప్రతిమలు (2) (ఒకటి మట్టిదీ - మఱొకటి పురోహితునికి దానమీయడానికి) అక్షతలకి బియ్యం - రెండు పాన పాత్రలు - రెండు ఉద్ధరిణెలు - ఆఱు అగరువత్తులు - ఆఱు హారతి కర్పూరపు బిళ్లలు - రెండు కొబ్బరికాయలు - పన్నెండు అరటి పళ్లు - నలభై తములపాకులు - పన్నెండు వక్కలు - పత్తి (దూది) - పత్రి - నలభై రెండు గరికెలు - వెడల్పా లేతూ ఉన్న పళ్లాలు నైవేద్యానికీ పత్రికీ కలిపి రెండు - ఒక జయఘంట (జేగంట) - ఒక ఉపవస్త్రం (చేతుడుపు గుడ్డ) - **ఈ తుండము నేకదంతమును .... పుస్తకమున్నూ.**

## వీటిలో పూజకి చాల ముందుగా సిద్ధం చేసుకోవలసినవి.

* అన్నివైపులా సమానమైన బరువుండేలా ఫలాలతో పాలవెల్లి.
* పత్రిని మొత్తం నీటితో కడిగి ఏ జాతికి ఆ జాతిని ఆకులు ఆకులుగా ఒలిచి పెట్టిన వేఱువేఱు పైకా సంచులు.
* పత్తి (దూది)ని సన్నని దారంగా చేసి మధ్య మధ్యలో పసుపు కుంకుమలని అద్దిన రెండు యజ్ఞోపవీతాలు.
* రూపాయి బిళ్లలంతటి పరిమాణంలో దూదిని తీసికొని తడిపి, నిటివి ఒత్తి కుంకుమని అద్దిన రెండు రక్తవస్త్రాలు.
* చీపురుపుల్లలకి చివర దూదిని చుట్టి నేతిలో/నూనెలో ముంచి పొడిగా ఉండేలా ఒత్తి చేసిన రెండు 'కైవత్తులు'.
* కొంత బియ్యాన్ని పసుపుతోనూ, మఱి కొంత బియ్యాన్ని కుంకుమతోనూ కలిపి చేసిన హరిద్రాక్షతలూ, రక్తాక్షతలూ.
* ప్రమిధ నిండుగా నూనె + మూడు వత్తులూ.
* రెండు వక్కలూ రెండు అరటి పళ్లూ చొప్పున ఐదైదు తములపాకులలో పెట్టి దారంతో చుట్టిన ఆఱు తాంబూలాలు
* **తుండము నేకదంతమును.. అనే ఈ పుస్తకాన్ని చదవడం.**

## ఇక పూజా ప్రారంభవేళలో సిద్ధం చేసుకోవలసినవి

* చతురస్రాకారపు కాగితాలూ లేదా ఏవైనా విస్తరి విడిఆకులూ తీసుకుని ఒక్కోదానిలో ఒక్కో వస్తువు చొప్పున - పసుపూ, కుంకుమా, ఆఱు అరటిపళ్లూ, ఆఱు అగరువత్తులు, ఒక అగ్గిపెట్టీ, రెండు కొబ్బరి కాయలూ - పెట్టి వేఱువేఱుగా వాటిలో ఉంచుకోవాలి. ఇలా ఉంటే పూజ సమయంలో వస్తువులకోసం వెతుక్కోవడం, వాటి కోసం అనవసరంగా మాట్లాడుకోవడం చిఱ్ఱుబుఱ్ఱులూ వంటివి ఉండవు.
* రెండు పాన పాత్రలు (గ్లాసులు) - రెండు ఉద్ధరిణెలు
* పన్నెండు హారతి కర్పూరపు బిళ్లలు
* ఒక జేగంట
* కొబ్బరి నీళ్లు పట్టుకునేందుకు ఒక పాత్రా, అలాగే కొబ్బరికాయ కొట్టేందుకు తగిన ఏర్పాటూ
* ఏ పత్రితో పూజించవలసి వస్తే ఆ పత్రిని దానిలోనికి ఒంపుకుని పూజ చేసుకునేందుకు వీలుగా వెడల్పుగా లోతూగా ఉన్న ఒక పళ్లెం
* చామరానికి బదులుగా విసన కఱ్ఱ (వీలుంటే నెమిలి పింఛాలది)
* పుష్పాలని ఉంచుకొనేందుకు ఒక పళ్లెం
* పిల్లలు చదువుకొనే పుస్తకాలూ - సాయంత్రం వేళ ధరించబోయే క్రొత్త బట్టలు ఉంటే అవీ - పెట్టుకోబోయే నూతన ఆభరణాలు ఉంటే అవీ - (పసుపు వినాయకుణ్ణి పూజించాక, మొత్తం పూజ అంతా అయ్యాక ఆ పసుపుని పైవాటికి పెట్టుకోవడం కోసం)
* ఒక పాన పాత్రలో చిన్న చెంచాతేనె + అంతే పెరుగు (ఆవు పెరుగు కాదు - గదా అని మొత్తం ఎగగొట్టేయడం కంటె సంప్రదాయం కోసం సిద్ధంగా ఉన్న పెరుగు) + అన్నేపాలు + అంతే పంచదార + అంతే నేయి కలిపి తీర్థంగా ఇయ్యడం కోసం వేఱు వేఱుగా ఉంచుకోవాలి.

పూజా సమయంలోనే, అదికూడా ఆయన అవసరం వచ్చినప్పుడు మాత్రమే చేయవలసినది పసుపు వినాయకుణ్ణి. ఈయన్నే హరిద్రా గణపతి అంటారు.

**వీటన్నింటికీ తోడుగా ఈ తుండము నేకదంతమును ...... పుస్తకం కూడ.**

## వినాయక వ్రత కల్పము

ఓమ్ ...... ఓమ్ ....... ఓమ్

శుక్లాం బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవి ఘ్నోప శాంతయే ॥

సుముఖ శ్చైకదంత శ్చ కపిలో గజకర్ణికః లంబోదర శ్చ వికటో విఘ్నరాజో గణాధిపః ధూమకేతు ర్గణాధ్యక్షః ఫాలచంద్రో గజాననః వక్రతుండ శ్శూర్పకర్ణో హేరంబః స్కందపూర్వజః అష్టా వష్టా చ నామాని యః పఠే చ్ఛృణు యా దపివిద్యారంభే వివాహే చ ప్రవేశే నిర్గమే తథా సంగ్రామే సర్వకార్యేషు విఘ్న స్తస్య న జాయతే.

సుముఖ శ్చ = అనుగ్రహిస్తూ మనని చూస్తున్న ముఖంతో కన్పిస్తున్నవాడూ
ఏకదంత శ్చ = ఒక దంతమే కలవాడూ
కపిలః = లేత సిందూరపు రంగు శరీరం కలవాడూ
గజకర్ణికః = ఏనుగు చెవులతో సమానమైన పెద్ద చెవులు కలవాడూ
లంబోదర శ్చ = పెద్ద బొజ్జవాడూ
వికటః = కష్టాలనీ, పాపాలనీ కూడా తొలగించగలవాడూ
విఘ్నరాజః = విఘ్నాలని అదుపు చేయగలవాడూ
ధూమకేతుః = యుద్ధ కాలాలలో తన రథానికి యజ్ఞధూమమే జెండాగా కలవాడూ
గణాధ్యక్షః = ఒకప్పటిలా తన గణానికి మాత్రమే కాక సర్వ గణాలకీ అధ్యక్షుడూ - ఫాల చంద్రః = నుదుటిమీద చంద్రరేఖ కలవాడూ
గజాననః = ఏనుగు ముఖమే తన ముఖంగా కలవాడూ
వక్రతుండః = వంకరగా పెట్టిన తన తుండం ద్వారా ఓంకారాన్ని తలపింపచేసేవాడూ
శూర్పకర్ణః = చేట ఆకారంలో విశాలంగా ఉండే చెవులు కలవాడూ
హేరంబః = గాదెవంటి బొజ్జ కలవాడూ
స్కంద పూర్వజః = కుమార స్వామికి అన్న ఐనవాడూ....

అని వినాయకునికి ఉన్న ఈ ముఖ్యమైన పదహారు పేర్లనీ విద్యా ప్రారంభం

చేసేటప్పుడూ - వివాహం తలపెట్టినప్పుడూ ..... ఇలా ధర్మ యుద్ధంతో సహా ఏ పనిలోనైనా ప్రవేశించేప్పుడూ, నిష్క్రమించేప్పుడూ అనుకుంటే విఘ్నబాధ ఉండనే ఉండదని పై శ్లోకానికి భావం.

ఒకప్పుడు ఆయన సు-ముఖుడు, ఇప్పుడు గజముఖుడయ్యాడు.

ఒకప్పుడు ఆయన వయసులో ఆయన కుండాల్సినంత కంటె కొద్దిగా మించిన పరిమాణంలో చెవులున్నాయి. ఈనాడు 'గజకర్ణికుడు' అయ్యాడు.

ఒకప్పుడు లంబోదరుడు, నేడు హేరంబుడు.

ఒకప్పుడు గణాధిపుడు. నేడు గణాధ్యక్షుడు.

ఒకప్పుడు ఆయన ఒక్కడే. ఇప్పుడు కుమారస్వామికి అన్న కూడా అయ్యాడు. దీంట్లో వినాయకుని కథ మొత్తం వస్తుంది.

ఇలా మార్పు రావడానికి పార్వతి చలవా, శివుని అనుగ్రహమూ కారణం కాబట్టి ఈ పదహారు పేర్లనీ అనుకుంటే పరోక్షంగా పార్వతీ పరమేశ్వరులని తలచినట్లే ఔతుందన్నమాట. అందుకే ఈ 'పదహారు పేర్లనీ' - అని - అనకుండా ఎనిమిదెనిమిది పేర్లనీ (అష్టౌ వష్టౌ చ) అని అంది శ్లోకం. అప్పటి విఘ్నపతి ఎనిమిది పేర్లూ + నేటి గణాధిపతి ఎనిమిది పేర్లూ కలిసి ఎనిమిదెనిమిది అంటే పదహారు పేర్లయ్యాయనీ, ఈ పేర్లని చదివితే విఘ్నబాధ లేదనీ చెప్తోంది ఈ మంత్రం లాంటి శ్లోకం.

ఈ పేర్లని చదివాక భక్తితో ముమ్మారు ఆచమించాలి.

అఱచేతిలోని గుంటలో మినపగింజ మునిగేంత నీటిని మాత్రం చప్పుడు కాకుండా స్వీకరించడాన్నీ - ఆ మీదట మాషమాత్రం జలం పిబేత్ - ఆచమనం చేసిన ఆ ఎంగిలి నీటిని తలకి తుడుచుకోకపోవడాన్నీ - మఱొక ఉద్ధరిణెడు నీళ్లతో ఎంగిలి చేతిని కడుగుకొని ప్రక్కన ఉన్న ఉపవస్త్రంతోతుడుచుకోవడాన్నీ ఆచమించడం అంటారు.

**కేశవాయ స్వాహా - నారాయణాయ స్వాహా - మాధవాయ స్వాహా - గోవిందాయ నమః - విష్ణవే నమః - మధుసూదనాయ నమః - త్రివిక్రమాయ నమః- వామనాయ నమః - శ్రీధరాయ నమః - హృషీకేశాయ నమః - పద్మనాభాయ నమః- దామోదరాయ నమః - సంకర్షణాయ నమః - వాసుదేవాయ నమః - ప్రద్యుమ్నాయ**

నమః - అనిరుద్ధాయ నమః - పురుషోత్తమాయ నమః - అధోక్షజాయ నమః - నారసింహాయ నమః - అచ్యుతాయ నమః - జనార్దనాయ నమః - ఉపేంద్రాయ నమః- హరయే నమః - శ్రీకృష్ణాయ నమః

శ్రీ మహా విష్ణువుకి ఉన్న 24 పేర్లూ ఇవి. మనది కలియుగం. కృష్ణుడు నిర్యాణం చెందిన రోజునే కలియుగం పుట్టింది. అందుకే కృష్ణునితో ఈ నామాలు అయిపోతాయి.

నమస్కరిస్తూ ఉండాలి.

**లక్ష్మీ నారాయణాభ్యాం నమః - వాణీ హిరణ్యగర్భాభ్యాం నమః - ఉమా మహేశ్వరాభ్యాం నమః - శచీ పురందరాభ్యాంనమః - అరుంధతీ వసిష్ఠాభ్యాం నమః - సర్వేభ్యో మహాజనేభ్యో నమః.**

సత్త్వ గుణానికి ప్రతీక అయిన లక్ష్మీనారాయణ దంపతులకీ - రజోగుణానికి ప్రతీక అయిన బ్రహ్మసరస్వతి దంపతులకీ - తమోగుణానికి ప్రతీక అయిన ఉమామహేశ్వర దంపతులకీ - దేవాధ్యక్షుడైన శచీపురందర దంపతులకీ - సప్తమహర్షులకీ ప్రతినిధి అయిన అరుంధతీ వసిష్ఠ దంపతులకీ - ఇంకా నా ఈ పూజా వ్రతాన్ని చూడవచ్చిన మహాజనులు (బంధు - మిత్ర -పరివారం) అందరికీ నమస్కరిస్తున్నాను.

**దేవీం వాచ మజనయంత దేవాః తాం విశ్వరూపాః పశవో వదంతి।**

**సా నో మంద్రేషు మూర్జం దుహానా ధేను ర్వా గస్మా ముపసుష్టు తైతు॥**

దేవతలు సృష్టించిన కామధేనువులా కోరిన కోరికలని ఏవాక్కు ఈయగలదో, ఆ వాక్శక్తి (వాక్కుకి ఉండే శక్తి) నాలో ప్రవేశించు గాక - లోకంలో 'మీ నోటి వాక్యాన ఫలించింది' అంటూంటారు. అంటే ఈ వాక్శక్తి ఆయనలోప్రవేశించి ఉన్నప్పుడు 'మనని ఉద్దేశించి శుభమగుగాక' అంటూ పల్కాడు కాబట్టి మనకి ఫలించిందన్నమాట. రాబోయే మేలుని కోరేవాడూ - అందుకే ఈ కుటుంబాన్ని పిలిచి ఈ వ్రతం చేసికొనవలసిందని ప్రోత్సహించిన వాడున్నూ అయిన పూజ చేయించే ఈ పురోహితుడు తనకీ అలాటి శక్తి రావలసిందిగా ప్రార్థిస్తున్నాడన్నమాట. ఒకవేళ పూజ చేసుకునేవాడు యజమానే అయితే తనకి ఆ వాక్శక్తి రావలసినదిగా తానుకూడా వాక్శక్తిని ప్రార్థిస్తున్నాడన్నమాట.

(అక్షతలను వెనుకకు వేసుకుంటూ, ప్రాణాయమాన్ని చేస్తూ)

ఉత్తిష్ఠంతు భూతపిశాచా: ఏతే భూమి భారకా:

ఏతేషా మవిరోధేన బ్రహ్మకర్మ సమారభే॥ (దీని వలన మనం చేసే పూజ మీద మన మనసు లగ్నమౌతుంది.)

మమ ఉపాత్త దురితక్షయద్వారా శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం శుభే శోభనముహూర్తే శ్రీ మహావిష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య అద్య బ్రహ్మణః ద్వితీయ పరార్థే - శ్వేత వరాహకల్పే- వైవస్వత మన్వంతరే - కలియుగే - ప్రథమపాదే - జంబూద్వీపే - భరతవర్షే - భరత ఖండే - మేరో: దక్షిణ దిగ్భాగే - శ్రీశైలస్య ఈశాన్య ప్రదేశే - కృష్ణా కావేర్యో ర్మధ్యదేశే సమస్త దేవతా బ్రాహ్మణ హరి హర చరణ సన్నిధౌ - అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన - ----- నామ సంవత్సరే - దక్షిణాయనే - వర్షర్తౌ - భాద్రపదమాసే - శుద్ధపక్షే-చతుర్థ్యాం - ------ వాసరే - హస్తానక్షత్రయుక్తాయాం శుభయోగ శుభకరణ యుక్తాయాం శుభతిథౌ శ్రీమాన్ ----గోత్ర:---- నామధేయ: శ్రీమత: . . . గోత్రస్య . . . నామధేయస్య మమ ధర్మపత్నీ సమేతస్య చతుర్వర్గ ఫలపురుషార్థ సిద్ధ్యర్థమ్ ఇష్టకా మ్యార్థ సిద్ధ్యర్థం వర్షే వర్షే ప్రయుక్త వరసిద్ధి వినాయక దేవతా ముద్దిశ్య వరసిద్ధి వినాయక దేవతా ప్రీ త్యర్థం పురా ణోక్త ప్రకారేణ యావ చ్ఛక్తి ధ్యా నా వాహనాది షోడ శోపచార పూజాం కరిష్యే (అని నీటిని కుడిచేతి నాల్గవదైన ఉంగరపు వ్రేలితో తాకాలి).

దీన్నే సంకల్పం అంటారు. ఏపని ఎందుకుగా చేయదలిచామో దాన్ని మనసులో భావించడమే సంకల్పమంటే.

బ్రహ్మకున్న 100 దివ్య సంవత్సరాల ఆయుష్యంలో పూర్వార్ధమని పిలువబడే మొదటి 50 సంవత్సరాలు దాటాక - పరార్ధమని పిలువబడే రెండవ 50 సంవత్సరాల కాలంలో - శ్వేతవరాహమనే పేరిట కల్పంలో - ధర్మబద్ధంగా పరిపాలించే 14 మంది మనువులలో 7వ వాడైన వైవస్వత మనువు పరిపాలనలో

17,28,000 సంవత్సరాల కృతయుగం దాటాక - 12,96,000 సంవత్సరాల త్రేతాయుగం అయ్యాక - 8,64,000 సంవత్సరాల ద్వాపర యుగం గతించాక వచ్చిన కలియుగం (1 × 4,32,000)లో ఉన్న నాల్గింటిలో మొదటి పాదంలో అంటే 4,32,000 + 4 = 1,08,000 సంవత్సరాల కాలంలో (ఇంతవరకూ దేవతాకాలం - ఈ సంవత్సరాలూ మన 12 నెలల సంవత్సరాలూ ఒకటి కాదు.)

ఏడింటిలో ఒకటైన జంబూ అనే పేరుగల ఒక ద్వీపంలో - 7 వర్షాలలో ఒకటైన భరతవర్షమనే ప్రదేశంలో - 7 ఖండాలలో ఒకటైన భరత ఖండంలో - సప్త పర్వతాలలో ఒకటిగా ఉంటూ అన్నిటికీ ఎటుచూచినా మధ్యప్రదేశంలో ఉండే మేరుపర్వతానికి దక్షిణభాగంలో, శ్రీ అనే పేరుగల పర్వతానికి (శ్రీశైలం) ఈశాన్యంగా - జీవనదులైన కృష్ణా కావేరీ నదుల మధ్య ప్రదేశంలో (ఇది మాత్రం ఎవరుండే ప్రదేశానికి అనుగుణంగా వారికి మాఱుతూ ఉంటుంది.)

సమస్త దేవతలూ భూదేవతలయిన బ్రాహ్మణులూ ఉన్న శివకేశవ అభేదంతో నిలిచిన పరమాత్మ సన్నిధిలో - లోకంలో అంతా ఏ చంద్రుణ్ణి బట్టి కాలాన్ని లెక్కిస్తున్నారో అలాటి చాంద్రమానం ప్రకారం 60 సంవత్సరాలలో ---- సంఖ్యగల ----- అనే పేరుగల సంవత్సరంలో - ఆఱు ఋతువులలోనూ మూడవదైన వర్షర్తువులో - పన్నెండు మాసాల్లోనూ ఆఱవదైన భాద్రపదమాసంలో - రెండు పక్షాలలోనూ రెండవదైన కృష్ణ పక్షంలో - పదిహేను తిథులలోనూ నాల్గవదైన చవితి (చతుర్థి) నాడు, ఏడు వారాల్లోనూ ---వదైన ----- వారం నాడు.

ఇరవైఏడు నక్షత్రాలలోనూ పదమూడవదైన హస్తానక్షత్రంలో, ఇలాగే శుభమైన యోగ - కరణాలలో ఫలాని ఋషిపేరిటి గోత్రానికి సంబంధించిన నేను, పరమాత్మ అనుగ్రహ దృష్టి నాపై ప్రసరిస్తున్న నేను (శ్రీమాన్ = పరమాత్మ అనుగ్రమదృష్టి ప్రసారం తనపై కలవాడు). ప్రార్థిస్తూ,

ధర్మపత్నితోకూడిన నాకు ధర్మ - అర్థ - కామ - మోక్ష - ఫలాల కోసమూ - తలచిన పని జరిగేందుకున్నూ - ప్రతి సంవత్సరమూ వచ్చే వరసిద్ధి వినాయక పూజని చేయదలిచానని శ్రీమహావిష్ణువుకి స్థానమైన నీటిని స్పృశించి ప్రమాణం చేస్తున్నానని దీని భావం.

**త దాదౌ నిర్విఘ్నతయా పరిసమా ప్త్యర్థం మహాగణా ధిపతి పూజాం కరిష్యే (మళ్ళీ నీటిని తాకాలి.) తదంగ కలశా రాధనం కరిష్యే (మళ్ళీ నీటిని తాకాలి).** వరసిద్ధి వినాయకుణ్ణి పూజించే అర్హత లభించడానికై మహాగణపతిని ధ్యానించి ఆయనని సంతృప్తుణ్ణి చేసి, ఆ మీదట వరసిద్ధి వినాయక పూజని చేస్తాను. ఈ ఇద్దరిపూజలో భాగంగా ముందుగా నావద్ద ఉన్న కలశానికి (పాత్రకి) పూజని చేయబోతున్నాను.

ఇదేమిటి? చెంబుకి పూజ చేయడమా? అనిపిస్తుంది. లోతుగా గమనిస్తే యథార్థం గోచరిస్తుంది. అదేమిటో చూద్దాం.

కలశం గంధపుష్ప - అక్షతై రభ్యర్చ్య - కల శోపరి హస్తం నిధాయ -

కలశస్య ముఖే విష్ణు: కంఠే రుద్ర స్సమాహిత:

మూలే తత్ర స్థితో బ్రహ్మ మధ్యే మాతృగణా: స్మృతా:

కుక్షౌ తు సాగరా స్సర్వే సప్తద్వీపా వసుంధరా

ఋగ్వేదో థ యజుర్వేద స్సామవేదో హ్య థర్వణ:

అంగై శ్చ సహితా స్సర్వే కల శాంబు సమాశ్రితా:।

ఆపో వా ఇదగ్ం సర్వమ్..ఓమ్)

గంగే! చ యమునే! చై వ గోదావరి ! సరస్వతి !

నర్మదే ! సింధో ! కావేరి ! జలే స్మిన్ సన్నిధింకురు!

కావేరీ తుంగభద్రా చ కృష్ణవేణీ చ గౌతమీ

భాగీర థీతి విఖ్యాతా: పంచగంగా: ప్రకీర్తితా:॥

ఆయాంతు దేవపూ జార్థం దురితక్షయకారకా:

కల శోదకేన పూజాద్రవ్యాణి దేవమ్ ఆత్మానం చ సంప్రోక్ష్య. కలశంలోని నీటితో పూజాద్రవ్యాలనీ దేవుణ్ణీ తననీ తన కుటుంబ సభ్యులనీ చల్లుకోవాలి.

ఇక ఇక్కడి నుండీ ఏ నీటిని మాత్రం ఈ పూజ అయ్యేంతవరకూ వాడదలిచామో ఆ నీరున్న పాత్రకి 'కలశం' అని పేరు పెట్టుకోవాలి. దానికి చుట్టూ మూడు కుంకుమ-మూడు గంధం బొట్లూ పెట్టాలి. ఆ నీటిలో రెండు మూడు అక్షతలని వేసి రెండు తములపాకులని ఉంచాలి.

ఆ కలశంపైన చేతిని బోర్లించి - ఈ కలశం పై భాగంలో విష్ణువున్నాడనీ - మధ్య భాగంలో (కంఠం) రుద్రుడు ఉన్నాడనీ - కలశం క్రింది భాగంలో బ్రహ్మ ఉన్నాడనీ - ఇక కలశం మధ్యభాగంలో దేవవిశేషాలని తెలిపిన వారూ - దేవతలకి తల్లులైన వారున్నూ అయిన దేవమాతృక గణాలు ఉన్నారనీ, కలశంలో ఉన్న నీటిలో సప్తద్వీపాలతో ఉన్న భూమి ఉందనీ, సప్తసముద్రాల జలమూ, నాలుగు వేదాలూ, వాటికి సంబంధించిన వేదాంగాలతో సహా ఉన్నాయనీ - గంగ - యమున - గోదావరి-సరస్వతి - నర్మద - సింధు - కావేరి - తుంగ భద్ర - కృష్ణవేణి - అనే ఇన్ని నదుల జలమూ ఉందనీ - అలా ఉండేలా అనుగ్రహించవలసిందనీ మొక్కుతూ - 'ఈ జలం

దేవపూజకీ, నా పాపాల సంఖ్య తగ్గించడానికీ ఉపయోగపడుగాక' అనుకుంటూ ఆ నీటిని రెండు తములపాకులతో పూజ చేయబోయే దేవుని మీదా - తెచ్చిన పూజా ద్రవ్యాలన్నింటి మీదా - తనమీదా - తన కుటుంబ సభ్యుల మీదా చిలకరించుకోవాలి.

దీన్నే 'పవిత్రీకరించడం' అంటారు. దేవుని బొమ్మని కొన్నాం. బొమ్మని చేసినవాడు స్నానం చేయక . . . లేదా ఏదో విధంగా అపవిత్రుడుగా ఉండి ఆ బొమ్మని చేసి ఉండవచ్చు. అలాగే తెచ్చుకున్న పూవులకీ పత్రికీ దోషాలు ఏవైనా మనకి తెలియనివి ఉండవచ్చు. దేవుని ఆకారంలో తేడాలూ ఉండవచ్చు. వీటన్నింటినీ సరిచేసేది ఈ మార్జనం. అంటే కలశంలోని నీటిని చల్లుతూ చేప్పే ఈ శ్లోకాల విధానమన్నమాట.

నిజంగా గోదావరిలో మునుగుతూ కూడా ఎక్కడ జలుబు చేస్తుందో ననుకుంటే ఫలితం సున్నట. ఇంట్లో నీటిలో స్నానం చేస్తూకూడా 'పంచగంగా స్నానమహం కరిష్యే' అనుకుంటే ఫలిత ముంటుందట. ఇలాంటి ఉత్తమ భావనని కల్గిస్తుంది ఈ కలశారాధనం. వ్యయప్రయాసలకి ఓర్చి కాశీకి పోయి అక్కడి గంగనీటిని ప్రతి పూజకీ తెమ్మని చెప్పలేదు శాస్త్రం. ఆ భావనతో ఇక్కడ ఉంటే చాలు 'గంగాస్నానం చేసిన ఫలితం లభిస్తుం'దని తెల్పిన శాస్త్రం ఎంత విశాల హృదయం కలది!

ఇలా పూజాద్రవ్యాలని శుద్ధి చేసాక హరిద్రాగణపతిని అంటే పసుపు వినాయకుణ్ణి చేయాలి. ఈయనని ముందుగా చేసేసి ఒకచోట భద్రంగా ఉంచి ఆ మీదట పాలవెల్లి నుండి అన్ని పనులూ ఆయన సమక్షంలోచేయడం ఎలాటిదంటే -ఒక ప్రసిద్ధ వ్యక్తిని ముందుగానే వేదిక మీదికి పిలిచి అధ్యక్షస్థానంలో కూచోబెట్టి, ఇక అప్పుడు - బల్లలూ కుర్చీలూ వేస్తూ సభకి రావలసిందిగా జయప్రదం చేయవలసిందిగా కోరుతున్నామని శ్రోతలని పిలుస్తూ ప్రకటించడం - లాటిది. జీవితంలో ఏ వేదికనీ ఎక్కనేలేమనీ - అధ్యక్షస్థానం ఎన్నడూ లభించనే లభించదనీ అనుకునే పుణ్యాత్మునికి, అలా చేసినా కూడా మోక్షం పొందినంత ఆనందం కల్గవచ్చేమోగాని, పరమాత్మకి మాత్రం కోపం కల్గుతుంది. కాబట్టి అలా చేయడం పద్ధతి కానే కాదని గమనించాలి.

అందరూ వచ్చాక - అన్నీ సిద్ధమయ్యాక ఉన్నతాధికారిని ఆహ్వానించడం ఆయన సభకి రావడం సరైన సంప్రదాయం కదా! అందుకని పసుపు వినాయకుణ్ణి

పూజ ప్రారంభించినప్పుడే చేయాలి. ఈయన్ని పసుపుతోనే చేయడానికి కారణం, ఆయనలో పీతాంబరుణ్ణి అంటే విష్ణువుని చూడాలని చెప్పడం కోసమే. కేశవాయ స్వాహా అని పూజని ప్రారంభించిన దగ్గరనుండి విష్ణుమంత్రాలే చదువుతున్నామని గుర్తించగలిగితే శివకేశవ భేదం లేదనేది అర్థమౌతుంది.

**భవసంచిత పాపౌఘ విధ్వంసన విచక్షణమ్ ।**

**వి ఘ్నాంధకార భాస్వంతం విఘ్నరాజ మహం భజే ॥**

**ఏకదంతం శూర్పకర్ణం గజవక్త్రం చతుర్భుజమ్ ।**

**పా శాంకుశ ధరం దేవం ధ్యాయే త్సిద్ధి వినాయకమ్ ॥**

**ఉత్తమం గణనాథస్య వ్రతం సంపత్కరం శుభమ్ ।**

**భ క్తాభీష్ట ప్రదం తస్మా ద్ధ్యాయే త్తం విఘ్ననాయకమ్ ॥**

**ధ్యాయే ద్గ జాననం దేవం తప్తకాంచన సన్నిభమ్ ।**

**చతుర్భుజం మహాకాయం సర్వాభరణ భూషితమ్ ॥**

**మహా గణాధిపతయే నమః - ధ్యాయామి.**

వరసిద్ధి వినాయకుని పూజకి ముందుగా నిన్ను పూజించదలచి దేవతలలో నిన్నే నిండు మనసుతో ధ్యానిస్తున్నాను - అంటూ ఆయన రూపాన్నీ గుణగణాలనీ మనసులోమనం అనుకోవాలి. అదే 'ధ్యాయామి' (ధ్యై చింతాయామ్) అంటే. ఒక విధంగా చెప్తే వేదిక మీదకి రావలసిందిగా అధ్యక్షుణ్ణి ప్రార్థిస్తున్నాను అనడం లాటిది. ఆయన వేదిక ఎక్కుతూండేలోగా ఆయనని గూర్చి చెప్పినట్లు ఈయన రూపాన్నీ - ఆయనకు పదవి లభించిన విధానాన్నీ మనసులో ఊహించుకోవాలి.

**అ త్రాగచ్ఛ జగ ద్వంద్య సురరా జార్చి తేశ్వర !**

**అనాథనాథ! సర్వజ్ఞ! గౌరీగర్భ సముద్భవ ! - ఆవాహయామి.**

నేను చేసిన ఈ పసుపుముద్దలోనికి నీవు ఆవహించవలసినదిగా ప్రార్థిస్తున్నాను. అప్పటివరకూ పసుపుముద్ద అయిన ఆ బొమ్మలోనికి, వేదిక మీది ఆసనంలోనికి అధ్యక్షుడు వచ్చి కూర్చున్నట్టుగా వినాయకుడు వచ్చాడన్నమాట. అధ్యక్షునికి దండ వేసినట్లుగా, వినాయకుడు వచ్చినదానికి గుర్తుగా ఆ పసుపు వినాయకునికి కుంకుమని పెట్టాలి. పూజ చేయబోయే వినాయకుని ప్రతిమముందు, రెండు తమలపాకులని

తూర్పుకి కొనలు ఉండేలా నేలమీద పెట్టి - ఆయనకు ప్రత్యేక ఆసనాన్ని - సిద్ధంగా ఉంచాలి.

**మౌక్తికైః పుష్యరాగై శ్చ నానారత్న విరాజితమ్॥**

**రత్న సింహాసనం చారు ప్రీ త్యర్థం ప్రతిగృహ్యతామ్॥ - ఆసనం సమర్పయామి.**

ఆ వినాయకుణ్ణి ఈ ప్రత్యేక ఆసనం మీద అక్కడనుండి తెచ్చి కూర్చోబెట్టాలి. ఈ ఆసనాన్ని ఆయన అంగీకరించి కూర్చునట్లుగా రెండు అక్షతలని వేయాలి.

**గౌరీపుత్ర! నమస్తే! స్తు! శంకర ప్రియనందన!**

**గృహా ణార్ఘ్యం మయా దత్తం గంధపు ష్పాక్షతై ర్యుతమ్॥ - అర్ఘ్యం సమర్పయామి.**

కైలాసం నుండి వచ్చిన మహానుభావుడు కాబట్టి ఆయనకి చేతులు కడుగుకునేందుకు నీటిని సమర్పించినట్లు భావిస్తూ, కలశంలోని తములపాకులతో ఈయన ముందు రెండు నీటి చుక్కలని వేయాలి. మనమే ఆయన చేతులని కడుగుతూన్నట్లూ - ఆ అదృష్టం మనకి దక్కినట్లూ భావించాలి.

**గజవక్త్ర! నమ స్తే! స్తు! స ర్వాభీష్ట ప్రదాయక!**

**భక్త్యా పాద్యం మయా దత్తం గృహాణ ద్విర దానన!! - పాద్యం సమర్పయామి.**

కాళ్లు కడుగుకునేందుకు నీటిని తెచ్చి ఆయన పాదాలని మనమే కడిగే అదృష్టవంతులమైన ఊహాతో తములపాకులతో కలశంలోని నీటిని ఇందాకటి అర్ఘ్యంలాగానే ఆయన ముందు మళ్లీ విడవాలి.

**అనాథనాథ! సర్వజ్ఞ! గీర్వాణ పరిపూజిత!**

**గృహా ణాచమనం దేవ! తుభ్యం దత్తం మయా ప్రభో !**

**ఆచమనీయం సమర్పయామి.**

తాగడానికి శుభ్రజలాన్ని ఆయనకు అందించినట్లూ, ఆయన త్రాగేంతటి పవిత్ర జలాన్ని అందించగల భాగ్యానికి మనం నోచుకున్నట్లూ భావిస్తూ, కలశ జలంలోని రెండుచుక్కలని (కలశజలాన్ని) ఆయన ముందు విడవాలి.

**రక్తవస్త్రద్వయం చారు దేవయోగ్యం చ మంగలమ్॥**

**శుభప్రదం గృహాణ! త్వం లంబోదర! హ రాత్మజ!**

**వస్త్రయుగ్మం సమర్పయామి.**

ఒకటి కట్టుకొని స్నానం చేయడానికీ, వేఱొకటి తుడుచుకొనడానికీ మొత్తం రెండు రక్త వస్త్రాలని వినాయకునికియ్యాలి.

**స్నానం పం చామృతై ర్దేవ! గృహాణ! గణనాయక!**

**అనాథనాథ! సర్వజ్ఞ! గీర్వాణ గణపూజిత!**

**పం చామృత స్నానం సమర్పయామి.**

**గం గాది సర్వతీర్థేభ్యః ఆహృతై రమలై ర్జలైః॥**

**స్నానం కురుష్వ భగవన్నుమాపుత్ర! నమోస్తు! తే॥**

**శు ద్ధోదకస్నానం సమర్పయామి.**

ఆయన స్నానం చేయడంకోసం శుభ్ర పవిత్ర జలాలని ఇయ్యాలి కాబట్టి, కొబ్బరికాయని కొట్టి ఆనీటిని సమర్పించాలి. ఆ జలాన్ని మనమే తెచ్చాం. కాని స్పృశించి తేలేదు గదా! ఎంత పవిత్రం!

**ఘృతవర్తి సహస్రై శ్చ కర్పూరశకలై స్తథా॥**

**నీరాజనం మయా దత్తం గృహాణ వరదో భవ॥ - నీరాజనం సమర్పయామి.**

స్నానం చేసి వచ్చిన కారణంగా ఒంటికి శైత్యబాధ కలగకండా కర్పూరంతో హారతిని ఆయనకివ్వాలి.

**రాజితం బ్రహ్మసూత్రం చ కాంచనం చో త్తరీయకమ్॥**

**గృహాణ దేవ! సర్వజ్ఞ! భక్తానా మిష్టదాయక!! - ఉపవీతం సమర్పయామి.**

స్నానం పిమ్మట ధ్యానం చేయాలికదా! దానిక్కావలసింది యజ్ఞోపవీతం. దాని నియ్యాలి. అంటే ఆయన ఇప్పటివఱకూ యజ్ఞోపవీతమే లేకుండా తిరుగుతున్నాడని అర్థం కానేకాదు. స్నానం చేయకుండా వచ్చాడని అంతకంటె కాదు. ఇక్కడ మన నీటితో స్నానం చేసాక ఇక ఆయన పూజ మొదలెడుతున్నాడని భావించి ఈయాలి, మేం ఇలా స్నానానంతరం - యజ్ఞోపవీతపు గొప్పదనాన్ని తెలిసిన వాళ్లం కాబట్టి - ధ్యానాన్ని చేస్తాం అని తెలియజేసుకోవడం కోసం సమర్పించాలి.

ముఖ్యుడైన వ్యక్తి మన యింటికి వచ్చినప్పుడు 'రండి రండి' అంటూ మనం త్రోవని చూపిస్తున్నాం. అతిథిని ఇలా ఆదరించడం మన సంస్కార విధానమని చెప్పుకోవడం కోసం - అతిథిగొప్పదనాన్ని మనం గుర్తించామని అతడికి తెలియజేసుకోవడం కోసమూ కదా! ఇక్కడ కూడా అంతే.

**దధిక్షీరసమాయుక్తం మ ధ్వాజ్యేన సమన్వితమ్।**

**మధుపర్కం గృహాణేదం గజవక్త్ర! నమోస్తు! తే॥**

**మధుపర్కం సమర్పయామి.**

మహానైవేద్యానికి ఆలస్యం ఉంది కాబట్టి ముందుగా ఆయనకి తీపిపదార్థాన్ని (బెల్లం ముక్క - తేనె . . . .) అందిస్తూ దానితో పాటుగా స్వచ్ఛమైన వస్త్రాల జతని - ఒకటి ధోవతిగా, రెండవది ఉత్తరీయంగా ధరించడానికి - అందివ్వాలి. మనం వేసుకోబోయే కొత్త వస్త్రాలని ఆయనకు చూపించాలి.

**చంద నాగరు కర్పూర కస్తూరీ కుంకుమాన్వితమ్।**

**విలేపనం సురశ్రేష్ఠ! ప్రీ త్యర్థం ప్రతి గృహ్యతామ్॥ - గంధాన్ ధారయామి.**

క్రొత్త బట్టలని ఆయన కట్టుకున్నట్టుగా మనం భావించి ఆ మీదట, మంచి గంధాన్ని నీటిలో కలిపి సన్నగా ఒంటినిండుగా చల్లాలి.

**ద శాంగం గుగ్గు లోపేతం సుగంధం సుమనోహరమ్।**

**ఉమాసుత! నమ స్తుభ్యం గృహాణ వరదో భవ॥ - ధూప మాఘ్రాపయామి.**

ఒళ్లంతా సుగంధం నిండేందుకై అగరువత్తుల ధూపాన్ని ఆయనకివ్వాలి.

**అక్షతాన్ ధవలాన్ దివ్యాన్ శాలీయాం స్తండులాన్ శుభాన్।**

**గృహాణ పరమానంద! ఈశపుత్ర! నమో స్తు తే! - అక్షతాన్ సమర్పయామి.**

ఇన్ని సపర్యలూ చేసాక ఇంకా ఏవైనా మఱచినవి - తీపి తినిపించాక ఆచమన జలాన్ని ఈయక పోవడం . . . .వంటివి - ఉంటే వాటి నిమిత్తమూ, నన్ను అనుగ్రహిస్తూన్న పరమాత్మగా నిన్ను గుర్తించానని తెలుపుకోవడంకోసమూ అక్షతలని ఆయనపై చల్లాలి.

**పూగీఫలసమాయుక్తం నాగవల్లీ దలై ర్యుతమ్।**

**కర్పూరచూర్ణసంయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్॥ - తాంబూలం సమర్పయామి.**

రుచికరమైన తాంబూలాన్ని ఆయనకి ఇవ్వాలి. ఆయన ఆ తాంబూలాన్ని చర్వణ చేస్తూంటే అప్పుడు మన కోరికని వెల్లడిస్తూన్నాం. "స్వామీ! యథాశక్తి నేను నీకు ఇప్పటివఱకూ సపర్యని చేసాను. నేటి భాద్రపద శుద్ధ చవితినాడు వరసిద్ధి వినాయక వ్రతాన్ని చేయదలిచాను కాబట్టి, ఆ వరసిద్ధి వినాయకుణ్ణి పూజించే అర్హత నిన్ను

పూజించిన కారణంగా నాకు లభించినట్టుగా అనుగ్రహించు.' నీవు వెళ్లి ఆయనను ఇక్కడకు పంపవలసినదిగా ప్రార్థన" అని వెల్లడించాం.

అతిథిని ఎలా పూజించాలో ప్రతి వ్యక్తికీ నేర్పేది పూజా విధానం. రాగానే ఆసనంలో కూర్చోబెట్టడం - చేతులు కడుగుకొనేందుకు నీళ్ల నీయడం - కాళ్లు కడుగుకొనేందుకు నీళ్లనీయడం . . . . ఇలా తాంబూలం వఱకు ఇచ్చి అతిథిని సంతోషపెట్టి ఆ మీదట తన కోర్కెని వెల్లడించడం ప్రాచీనులు పూజ ద్వారా మనకు నేర్పిన చక్కని సంప్రదాయం. ఇన్ని సేవలని పొందాక ఏ అతిథైనా యజమాని కోరిన ఏ కోరికనైనా కాదనగలడా? ఇది ఒక తీరుగా ముందుకాళ్లకి బంధం వేయడం లాంటిదే.

ఈ ప్రార్థనని చేసాక వినాయకుణ్ణి ఒక్కమాఱు అలా జరుపుతాం. అంటే మనం చేసిన సపర్య సరిగా ఉన్న కారణంగానూ, మనం 'అడిగే అర్హత ఉండి అడగ వీలైన కోర్కెనే' అడిగిన కారణంగానూ సంతోషించిన ఆ గణాధిపతి మన వద్దకి వరసిద్ధి వినాయకుణ్ణి పంపించడానికి కైలాసానికి బయలుదేరాడనీ, ఆ కారణంగా ఈ పసుపు ముద్దలో వినాయకుడు లేడనీ భావించి అలా జరిపామన్నమాట. అధ్యక్షుడు వెళ్లిపోయాక ఆ ఆసనానికి విలువ లేనట్లు గణాధిపతి వెళ్లిపోయాక మన ఎదురుగా కన్పిస్తున్నది పసుపు ముద్దేనన్నమాట.

**ఇక ఇక్కడి నుండి వరసిద్ధి వినాయక పూజ ప్రారంభమౌతుంది. గణాధిపతిని ధ్యానించినట్లే, ఇంతకు ముందున్న భవసంచిత పాపౌఘ... అనే చోటి నుంచి ఇక్కడి వఱకూ అవే శ్లోకాలని చదువుతూ అదే విధానంతో మనం కొనుక్కొని తెచ్చిన మట్టి వినాయకునికి పూజని చేయాలి. ఈయన కూడా తాంబూల చర్వణం చేస్తున్న కాలంలో ఆయనకు ఇప్పుడు పుష్ప పూజ చేస్తున్నాం.**

ఆచమనం చేయాలి. **కేశవాయస్వాహా - నారాయణ స్వాహా - మాధవాయ స్వాహా......** అంటూ. ఎందుకు మళ్లీ ఆచమనం చెయ్యాలి? అనిపించవచ్చు. పూజలో ఏ ఘట్టం ముగిసి మఱి ఏ ఘట్టం ప్రారంభమైందో అందఱికీ తెలిసేందుకు ఈ ఆచమనాన్నీ మళ్లీ సంకల్పాన్నీ చేయిస్తారు. అంతే కాదు. పూజ చేసే యజమాని అయిన ఈ వ్యక్తి ఉపవాసం చేసి ఈ కార్యక్రమాన్ని చేస్తున్నాడు కాబట్టి అలా మంత్రాలని చదువుతూన్నందువలన గొంతు ఆఱిపోనూ పోదు - యజమాని కాక పురోహితులు చదివే పక్షంలోఉపవాసంతో ఉన్న యజమాని ఇలా ఆచమనాన్ని అప్పుడప్పుడు చేస్తూండడం వలన శరీరంలో నీరసమూ రాదు.

ఆచమనం చేసాంగా ! ఇక పుష్ప పూజ ప్రారంభమౌతోందనే విషయాన్ని చెప్తున్నాం. పాదాలని పూజిస్తున్నాను - చీలమండలు - మోకాళ్ళు - పిక్కలు - తొడలు - కటి (మొత్త) - బొజ్జ - బొడ్డు - హృదయం - కంఠం - గూడలు - చేతులు - దంతం - నుదురు - తుండం - తల ఇంకా ఏమైనా మిగిలి ఉంటే వాటికీ నమస్కరిస్తున్నానని రాబోయే పుష్ప పూజలోని మంత్రాలకి భావం. వరసగా చూద్దాం.

**పుష్పైః పూజయామి. అ థాంగపూజా.**

**గ ణేశాయ నమః పాదౌపూజయామి॥ ఏకదంతాయ నమః గుల్ఫౌ పూజయామి - శూర్ప కర్ణాయ నమః జానునీ పూజయామి - విఘ్నరాజాయ నమః జంఘేపూజయామి ఆఖువాహనాయ నమః ఊరూ పూజయామి - హేరంబాయనమః కటింపూజయామి లం బోదరాయ నమః ఉదరం పూజయామి - గణనాథాయ నమః నాభిం పూజయామి గ ణేశాయ నమః హృదయం పూజయామి - స్థూల కంఠాయ నమః కంఠం పూజయామి స్కం ధాగ్రజాయ నమః స్కంధౌ పూజయామి - పాశహస్తాయ నమః హస్తౌ పూజయామి గజవక్త్రాయ నమః లలాటం పూజయామి - స ర్వేశ్వరాయ నమః శిరః పూజయామి - విఘ్న రాజాయ నమః - సర్వా ణ్యంగాని పూజయామి.**

పై నామాలని చదువుతూ పుష్పాలతో ఆయా అవయవాలని పూజిస్తూన్నట్టు మనసులో భావిస్తూ ఆయా పుష్పాలని ఆయా అవయవాలమీద ఉంచాలి. ఇదే తీరుగా రాబోయే ఆకుపూజ కూడా చేయాలి.

## ఏకవింశతి పత్రపూజ

శ్రీ మహావిష్ణు అవతారాలు ఇరవైఒకటి కాబట్టి, ఆ ఇరవైఒక్క మంది ప్రధాన గణపతులనీ ఈ ఇరవైఒక్క పత్రాలతోనూ పూజించబోతున్నామన్నమాట. ఇక్కడ ఇరవై ఒక్క పత్రాల పేర్లు సంస్కృతంలోనే ఉంటాయి. బృహతీపత్రమ్ అంటే వాకుడు ఆకు అని అర్థం. ఇలా తెలుగు చేస్తే మార్జాలానికి అర్థం బిడాలం అన్నట్లౌతుంది. ఇందులో కొన్ని పత్రాలు మనకి తెలియనివీ మరికొన్ని అసలు వినపివీ కూడా అనిపించవచ్చు. మరి ఇరవై ఒక్క ఆకులూ ఎలా అమరుతాయి? అనుకోనక్కరలేదు.

దొరికిన వాటిలో ఇరవై ఒక్క జాతులని ఒకచోట చేర్చి ఒక్కొక నామానికీ ఒకటి చొప్పున వేయడం చేయవచ్చు. లేని పక్షంలో సంఖ్యకు ఎన్ని తగ్గితే అన్నిటికీ ఒకే జాతి ఆకుని వేయడం కూడ చేయవచ్చు. మరీ తగ్గితే ఇరవై ఒకటికి సరిపడ సంఖ్యాలం

ఆకులు ఈ పూజకి లేవనుకున్నామంటే; పూజకి ఏ ఇరవై ఒక్క సంఖ్య ముఖ్యమో ఆ ఇరవై ఒక్క గణపతుల సంఖ్య మనకి తెలిసినట్టేకదా!

అయినా భగవంతుడు - భావగ్రాహీ స మాధవః - వ్యక్తి హృదయంలోని భావాన్ని గ్రహించేవాడే తప్ప ఈ రోజా ఆకుల సంఖ్యని ఈ భక్తుడు తగ్గించాడని లెక్కపెట్టుకుని కోపించడు.

**సుగంధాని సుపుష్పాణి జాజీకుందముఖాని చ।**

**ఏకవింశతి పత్రాణి సంగృహాణ నమోస్తు తే॥**

**అ థైక వింశతి పత్ర పూజా**

**సుముఖాయ నమః మాచీపత్రం పూజయామి - గ ణాధిపాయ నమః బృహతీపత్రం..**
**ఉమా పుత్రాయ నమః బిల్వపత్రం.. - గ జాననాయ నమః దూర్వాయుగ్మం..**
**హరసూనవే నమః దుత్తూరపత్రం.. - లం బోదరాయ నమః బదరీ పత్రం..**
**గు హాగ్రజాయ నమః అపామార్గపత్రం.. - గజకర్ణాయ నమః తులసీ పత్రం..**
**ఏకదంతాయ నమః చూతపత్రం.. - వికటాయ నమః కరవీర పత్రం..**
**భిన్నదంతాయ నమః విష్ణుక్రాంత పత్రం.. - వటవే నమః దాడిమీ పత్రం..**
**స ర్వేశ్వరాయ నమః దేవదారు పత్రం.. - ఫాలచంద్రాయ నమః మరువక పత్రం..**
**హేరంబాయ నమః సింధువార పత్రం.. - శూర్పకర్ణాయ నమః జాజీ పత్రం..**
**సు రాగ్రజాయ నమః గండకీ పత్రం.. - ఇభవక్త్రాయ నమః శమీపత్రం..**
**వినాయకాయ నమః అశ్వత్థ పత్రం.. - సురసేవితాయనమః అర్జునపత్రం..**
**కపిలాయ నమః అర్కపత్రం.. - శ్రీ గ ణేశ్వరాయ నమః ఏకవింశతి పత్రాణి పూజయామి.**

ముందుగా పత్రపూజ చేసి ఆ మీదట పుష్పాలతో పూజనిచేస్తే, వినాయకుడు చూడడానికి అందంగా కన్పిస్తాడు. కాబట్టి పత్రపూజ చేసిన మీదట మళ్లీ పుష్పపూజని చేస్తే బాగుంటుంది. అంతేకాని పత్రపూజకి తరువాతిదిగా పుష్ప పూజని మార్చేయకూడదు.

పుష్పాలతో పత్రాలతోఇలా పూజ చేసాక అష్టోత్తర శతనామపూజ ప్రారంభమౌతుంది. దీనిలో ప్రతి నామానికీ ముందుగా ఓంకారం ఉంటుంది. అంటే ఏ దేవుణ్ణి పూజించదలచి ఏ నామాన్ని పల్కినా, ముందు వినాయకుని పేరుని పలికి, ఆ పిమ్మటే 'ఆనాటి పూజకి సంబంధించిన ఆ దేవుణ్ణి' ప్రార్థిస్తున్నామన్నమాట. ఈ విధానం వినాయకుని పూజక్కూడా వర్తిస్తుందన్నమాట.

ఈ సందర్భంలో ఒక్కమాట. చాలమంది ఇళ్లలో అతి ముఖ్యమైన అష్టోత్తర శతనామ పూజ సమయానికి ఏం జరుగుతుందంటే, పూజకి ముందు ఎంతో ఆలస్యం చేసుకుని ఏది అతిముఖ్యమో ఆ అష్టోత్తరశతనామాల వద్దకి వచ్చేసరికి ఒక్కగుక్కకి పది-పదిహేను పేర్లచొప్పున చదివేసి 'అమ్మయ్య' అనుకుంటారు. 'అయ్యయ్యో!' అని భగవంతుడనుకుంటాడు.

ఒక పెద్ద సభలో ప్రముఖుల జాబితాని ఎవరో చదువుతున్నారనుకుందాం. అందులో మన పేరుకూడా ఉందనుకుందాం. నా పేరూ చదువుతారనే ఆనందంతో ఎదురుచూస్తూ మనం ఉన్నప్పుడు, సమయం అయిపోతోందనే దృష్టితో 'ఆ పేర్లని చదివే వ్యక్తి, ఒక్కబిగిలో పది పదిహేను పేర్లు చొప్పున చదివేసి', క్షణంలో చదవడం అయిపోయిందన్నాడనుకొందాం. ఎలా ఉంటుంది? ఇదీ అంతే!

ఒక్కొక్క నామాన్ని గృహయజమానీ లేదా పురోహితుడూ నిదానంగా చదువుతూంటే, ఇంట్లోని పిల్లలు పత్రాన్ని స్వామికి సమర్పిస్తూ ఆ నామాన్ని తిరిగి అంటూ ఆ నామానికున్న అర్థానికి సంబంధించిన రూపాన్ని మనసులో ధ్యానిస్తే అప్పుడు పూజ చేస్తున్నట్లు లెక్క. లేని పక్షంలో వేలంపాటలో జమ.

మంత్రాలు చదువుతూన్నప్పుడు, వేయవలసిన పత్రి మొత్తం వేయడం అయిపోయాక కూడా ఇంకా పత్రి మిగిలితే, మనకి వ(వ)చ్చిన వినాయకుని శ్లోకాలని చదువుతూ ఆయనపై చేతులతోనే వేయాలిగాని పళ్ళాలని ఆయనపై బోర్లించడం వంటివి తగదు. ముఖ్యుడైన వ్యక్తిపై, చల్లవలసినన్ని పూలనీ చల్లి, ఇంకా కొన్ని పూలు మిగిలిపోతే చేతులతో మళ్లీ చల్లుతున్నామే తప్ప పూలతో తట్టలని బోర్లిస్తున్నామా? ఇదీ అంతే గదా!

ఆకుపచ్చని పత్రితో ఆయనని పూర్తిగా కప్పివేసినా దోషంలేదు. అలా ఆయనని మూసివేయడం అవమానించడమే అయినట్లయితే నిమజ్జనం రోజున నీళ్లలో ముంచి వేయడం సంమానించడం అవుతుందా? కాదు గదా మరి! ఈయన పుట్టిన నక్షత్రరాశికి అధిపతి బుధుడు కాబట్టి, తాను ఎంత పచ్చగా ఉంటే అంత ఆయనకు సంతోషం. అలాగని పెద్ద విగ్రహం కొనుక్కొన్నవారు ఆయనని పత్రితో కప్పివేయాలని ఇబ్బందిపడడమూ సబబుకాదు. భక్తి ప్రధానమని గమనించాలి.

ఈ రాబోయే నామాలు నిజానికి నూట ఎనిమిది ఉండాలి. ఈ నూట ఎనిమిదింటినీ చదివి పూజ ముగించాక ఏ ఒక్క నామమూ మనకి గుర్తులో ఉండదు

కాబట్టి, నూట ఎనిమిది నామాలలోనూ ఏదో ఒక నామం బాగా మనసులో నాటుకు పోయేందుకు వీలుగా ఈ క్రింద అరవై ఎనిమిది నామాలే ఈయబడ్డాయి. మఱి ఆ నలభై నామాలూ ఎలాగ? అనుకోనక్కఱలేకుండా 'శ్రీ గణేశాయ నమః' అనే నామాన్నే నలభై మాఱులు ఈపూజ చేసే అందఱూ ఉచ్చరిస్తూ పూజ చేస్తే, ఈ నామం బాగా మనసులో నాటుకోవడమే కాక, ఇదొక మంత్రంగా మనకి ముందుకాలంలో పనిచేస్తుంది.

అష్టోత్తర శతనామాలు అనే పేరిట నూట ఎనిమిది నామాలని మాత్రమే అక్కడ ఇచ్చేదెందుకంటే వీటిలో ఏదోఒక నామాన్ని నీకిష్టమైనదాన్ని ఎంచుకొని ఆ నామాన్ని చెప్పలేనన్నిమాఱులు జపించి ఆ నామాన్ని 'ఫలితాన్ని ఈయగల ఒక మంత్రంగా చేసికోవలసింది సుమా!' అని పరోక్షంగా చెప్పడం కోసమే.

మొద్దుగా ఉన్న ఇనుముతో దేన్నీ నరకడం సాధ్యపడదు. అదే ఇనుముని బాగా అరగదీసినట్లయితే, ఆ ఇనుప వస్తువుకి వచ్చిన పదునుతో ఆ ఇనుము ఒక ఆయుధమై నరికేందుకు తోడ్పడుతుంది. అలాగే నూట ఎనిమిదింటినీ చదివేసి ఏదో ఒక నామాన్ని మన జీవితానికి ఎంచుకోకుండాపోతే 'పూజ చేసినట్లౌతుంది' కాని మన కష్టాలని దాటించేందుకు తారక మంత్రంగా ముందు నాటికి ఏదీ నిలవదు గదా!

అందుకని 'శ్రీ గణేశాయ నమః' అనే నామాన్ని నలభై మార్లు జపిస్తూ పూజ చేయవలసిందిగా సూచించడానికి ఇలా ఇవ్వడం జరిగిందన్నమాట. ఇదే నామాన్ని నలభై మాఱులు జపించక్కరలేదు. మన కిష్టమైన ఏ నామాన్నైనా జపిస్తూ పూజించుకోవచ్చు. అయితే ఏదో ఒక నామాన్ని ఈయాలి కాబట్టి, అతి శక్తిమంతమైన ఈ నామాన్ని ఈయడం జరిగిందన్నమాట. ఇంతమాత్రంచేత నూట ఎనిమిది నామాలతో ఎక్కడెక్కడ అష్టోత్తర శతనామాల పూజ ఉందో అక్కడి పేర్లతో పూజించడం సరికాదని అర్థం కానేకాదు.

మఱి 'శ్రీ గణేశాయ నమః' అనే ఈ నామాన్ని నలభై మాఱులు ఉచ్చరించాలి కదా! లెక్కలో ఎక్కువ తక్కువలెలా తెలుస్తాయి? అనుకోనక్కఱలేదు. ముందుగానే నూట ఎనిమిది పూలని, ఒక్కొక్క పళ్లెంలో చొప్పున పూజ చేసే అందఱి ముందూ పెట్టుకున్నార్పుని, ఒక్కో నామానికి ఒక్కో పూవుని మాత్రమే దేవుని మీద వేస్తూంటే ఈ సమస్య సుళువుగా విడిపోతుంది. **ముఖ్యమైన ఒక్క మాట. లెక్కకి దగ్గరైతే భక్తికి దూరమౌతామట.**

ఇంతకీ అతిముఖ్యమైన అష్టోత్తరశతనామపూజని చేసుకోబోతున్నామని సారాంశం.

## అష్టోత్తర శతనామ పూజ

ఓం గజాననాయ నమః - ఏనుగు ముఖం కలవానికి నమస్కారము.

ఓం గణాధ్యక్షాయ నమః - దేవతా గణాలకి అధ్యక్షుడైన వానికి....

ఓం విఘ్నరాజాయ నమః - విఘ్నాలని తన అదుపులో ఉంచుకునేవానికి....

ఓం వినాయకాయ నమః - వినాయకుడనే పేరుగల ఈ దేవునికి....

ఓం ద్వైమాతురాయ నమః - నలుగు పిండి చేసి ప్రాణాన్ని పోసిన పార్వతీ మాతకీ, తల నఱికి ఆ మీదట ఏనుగు ముఖాన్ని పెట్టి ప్రాణాన్ని పోసి తల్లి పాత్రని చేపట్టిన శంకరునికీ, ఇలా ఈ ఇద్దఱికీ బిడ్డడైన వానికి....

ఓం ద్విముఖాయ నమః - ఒకప్పుడు మానవ ముఖమూ, ఇప్పుడు ఏనుగు ముఖమూ కలవానికి....

ఓం ప్రముఖాయ నమః - దేవతలందఱిలోనూ టక్కున గుర్తించగల ముఖం కలవానికి...

ఓం సుముఖాయ నమః - తనని నమ్మి వరాన్ని అడగదలచిన ఎవరికైనా సుముఖునిగా కన్పించే వానికి....

ఓం కృతినే నమః - ప్రతి కార్యంలోనూ ధన్యుడైన వానికి....

ఓం ప్రథమాయ నమః - ఎవరు ఏపని చేపట్టినా నమస్కరింపవలసిన ప్రథమ దేవత అయిన వానికి....

ఓం ప్రాజ్ఞాయ నమః - చదువులకి అధిష్ఠాతయైన కారణంగా ప్రాజ్ఞుడైన వానికి....

ఓం మణికింకిణి మేఖలాయ నమః - మణుల ధ్వనులతో నిండిన నడుముపట్టీ లేదా వడ్డాణం కలిగిన వానికి....

ఓం సమస్త దేవతా మూర్తయే నమః - సమస్త దేవతల ఆకారమూ తానే అయినవానికి....

ఓం సహిష్ణవే నమః - భక్తులు కానివారూ రాక్షసులూ చేస్తుండే అపచారాలని కరుణా బుద్ధితో నిక్కలిగా సహించేవానికి....

ఓం సతతోత్థితాయ నమః - ఎప్పుడూ రక్షించాలనే ఉద్దేశ్యంతో అప్రమత్తుడై ఉండేవానికి....

ఓం కుంజరాసుర భంజనాయ నమః - కుంజరుడనే పేరుగల రాక్షసుణ్ణి వధించిన వానికి...

ఓం ప్రమోదాయ నమః - ఏ చిన్న పూజని తన గురించి చేసినా అమితానందాన్ని పొందే వానికి....

ఓం మోదక ప్రియాయ నమః - ఉండ్రాళ్లు తనకి ఇష్టమైన భక్ష్యంగా కలిగిన వానికి....

ఓం కాంతిమతే నమః - మిక్కిలి శాంత రూపంతో ఉండేవానికి....

ఓం గంభీర నినదాయ నమః - గంభీరమైన వేద ధ్వానమే తన కంఠస్వరంగా కలిగిన వానికి....

ఓం వటవే నమః - నిత్యమూ జ్ఞానాన్ని సంపాదించడమే లక్ష్యంగా కల వటువులా ఉండేవానికి....

ఓం ధృతిమతే నమః - రాక్షసులని వధించడం మొదలైన కృత్యాలలో ఎంతో ధైర్యం కలిగిన వానికి....

ఓం విఘ్నకర్త్రే నమః - ప్రపంచానికి నష్టాన్ని కలిగించే పనులకి విఘ్నాలని కలిగించే వానికి (లేదా) తనని ఆరాధించక ప్రారంభింప బడే పనులకి విఘ్నాలని కలిగించే వానికి....

ఓం విఘ్న హంత్రే నమః - ప్రజా సౌఖ్యం కలిగే పనులకీ - తనని ఆరాధించి ప్రారంభించిన కార్యాలకి - కలిగే విఘ్నాలని నాశనం చేయగలిగిన వానికి.... (లేదా) విఘ్న అనే పేరుగల రాక్షసుణ్ణి వధించిన వానికి....

ఓం విశ్వనేత్రే నమః - పంచ భూతాలూ ..... మొదలైనవన్నీ తమ తమ పనులని సక్రమంగా చేసేలా చూస్తూ ప్రపంచాన్ని సరిగా నడిపించేవానికి....

ఓం విరాట్పతయే నమః - మూల దేవతలందరికీ మూలమైనవానికి....

ఓం శ్రీ పతయే నమః - లక్ష్మికి భర్త అయిన వానికి....

ఓం వాక్పతయే నమః - వాక్కులకి అధిష్ఠాత అయినవానికి....

ఓం శృంగారిణే నమః - ఎప్పుడూ చక్కగా అలంకరించుకుని ఉండేవానికి....

ఓం సర్వకర్త్రే నమః - సృష్టి స్థితి లయాలు మూటినీ కూడా చేయగల శక్తి కలవానికి...

ఓం సర్వనేత్రే నమః - ఈ ప్రపంచంలోని అందరికీ బుద్ధివంటివాడై నడిపించే వానికి....

ఓం సర్వసిద్ధి ప్రదాయ నమః - అందరూ కోరిన కోరికలు తగిన కాలంలో సిద్ధించేలా వరాన్నీయగల శక్తి ఉన్నవానికి....

ఓం సర్వ సిద్ధయే నమః - తపస్సు చేసిన అందరికీ ప్రత్యక్షమయ్యేవానికి....

ఓం కపిత్థ పనస ప్రియాయ నమః - వెలగ, పనస మొదలైన పండ్లు తనకి ఇష్టమైనవిగా కలవానికి....

ఓం బ్రహ్మచారిణే నమః - నిత్యమూ బ్రహ్మపదార్థంలోనే సంచరించే లక్షణం ఉన్నవానికి....

ఓం బ్రహ్మరూపిణే నమః - ప్రపంచమంతా ధ్వంసమయిపోయినా ఏ బ్రహ్మ పదార్థం మాత్రం నిత్యమో, ఆ బ్రహ్మపదార్థమే తానైన వానికి....

ఓం బ్రహ్మవిద్యా విధాయకాయ నమః - ఏ బ్రహ్మవిద్య ఉందో దానిని తనలో ధరించిన వానికి....

ఓం జిష్ణవే నమః - జయమే తప్ప పరాజయమే ఎఱుగని వానికి....

ఓం విష్ణు ప్రియాయ నమః - ప్రపంచంలోని నిత్య, అనిత్య పదార్థాలన్నింటిలోనికీ వ్యాపించడమే తనకి ఇష్టంగా కలిగిన వానికి....

ఓం భక్త జీవితాయ నమః - భక్తులైనవారికి తానే సర్వస్వంగా ఉండేవానికి....

ఓం జిత మన్మథాయ నమః - మన్మథుణ్ణి తన అదుపులో ఉంచుకున్నవానికి...

ఓం ఐశ్వర్య కారణాయ నమః - తనని నమ్మి ఆరాధించినవారికి కలిగే ఐశ్వర్యానికి కారణంగా ఉండేవానికి....

ఓం జ్యాయసే నమః - అందరు దేవతలకంటె పెద్దయైనవానికి...

ఓం స ర్వోపాస్యాయ నమః - అన్ని మతాలవారి చేతనూ ఉపాసింపబడదగినవానిగా ఉండేవానికి....

ఓం ప్రభవే నమః - తన అధీనంలో అంతటినీ ఉంచుకున్నవానికి....

ఓం కుమార గురవే నమః - వయసులోనూ, జ్ఞానంలోనూ కుమారస్వామికంటె పెద్ద అయినవానికి....

ఓం అక్షోభ్యాయ నమః - ఎవరికీ ఓడింప వీలుకా(లే)నివానికి.

ఓం సుప్రదీపాయ నమః - మంచి కాంతినీ, వర్చస్సునీ కలిగించగలవానికీ - తానే కాంతిగా అయినవానికి....

ఓం సుఖ నిధయే నమః - సౌఖ్యాలని కోరేవారికి 'ఆరాధింపదగిన నిధి' వంటివానికి...

ఓం సురాధ్యక్షాయ నమః - దేవతలకి అధ్యక్షుడైనవానికి....

ఓం సురారిఘ్నాయ నమః - దేవతలకి శత్రువులైన వారందరినీ నాశనం చేసే శక్తి ఉన్నవానికి....

ఓం మహాగణపతయే నమః - ముప్పై ఇద్దరు గణపతులలోనూ అతి ముఖ్యుడైనవానికీ - ఎవరిని పూజిస్తే అందరు గణపతులకీ పూజ చేసినట్టవుతుందో అలాటి మహా గణపతియైనవానికి....

ఓం మాన్యాయ నమః - నిత్యమూ పూజింపదగినవానికి....

ఓం మహాకాయాయ నమః - ప్రపంచమంతా తనరూపమే అయిన కారణంగా, పెద్ద శరీరంకలవానికీ....

ఓం మహా బలాయ నమః - ఊహించ(లే)ని బలం కలిగినవానికి....

ఓం యక్ష కిన్నర సేవితాయ నమః- పాడడంలో నైపుణ్యంకల యక్షులచేతా - కిన్నరులచేతా తమ గానమాధుర్యంతో సేవింపబడేవానికి....

ఓం విఘాతకారిణే నమః - ఫలితంరాకూడని వాని విషయంలో అడ్డంకులని తెచ్చిపెట్టేవానికి....

ఓం విశ్వదృశే నమః - ప్రపంచమంతా తనకన్నుగా కలిగినవానికి....

ఓం విశ్వరక్షాకృతే నమః - ప్రపంచాన్ని రక్షించడమే తనపనిగా కలిగినవానికి....

ఓం కల్యాణగురవే నమః - సమస్త శుభకార్యాలలోనూ ఆదిగా పూజింపబడుతుండే వానికి....

ఓం ఉన్మత్త వేషాయ నమః - కొన్ని తీరుల ఉపాసనలవారికి 'ఉన్మత్త వేషంలో' ఉన్నవానిలా కన్పడే వేషం కలవానికి....

**ఓం పరజితే నమః** - ఏదో జయాన్ని పొందడంగాక, శ్రేష్ఠమైన జయాన్నే ఎప్పుడూ పొందే లక్షణమున్నవానికి....

**ఓం సమస్త జగ దాధారాయ నమః** - ఈ సమస్త ప్రపంచానికీ ఆధారభూతుడైనవానికి..

**ఓం స ర్వైశ్వర్యప్రదాయ నమః** - ఐశ్వర్యాలెన్నివిధాలో ఆ ఎనిమిది తీరుల ఐశ్వర్యాన్నీ ఈయగల శక్తి ఉన్నవానికి....

**ఓం ఆక్రాంత చిదచిత్ప్రభవే నమః** - నిత్యమైన - అనిత్యమైన పదార్థాలన్నింటిలోనూ తానాక్రమించి ఉండి సర్వానికీ ప్రభువైనవానికి....

**ఓం శ్రీ వి ఘ్నేశ్వరాయ నమః** - సంపదలనిచ్చేవానికీ ..... విఘ్నాలని నివారించేవానికీ...

**ఓం కామినే నమః** - కోరికలతో ప్రార్థించేవారికి వారి కోరికలని తీర్చాలనే కోరిక తనకి కలిగినవానికి....

**ఓం అప్రాకృత పరాక్రమాయ నమః** - ఎదుటివారి ఆలోచనలకి తగినట్టుగా తాను జయించడం కోసమై కొత్త కొత్తవైన పద్ధతుల్లో తన పరాక్రమాన్ని చూపగలవానికి....

**ఓం శ్రీ గ ణేశాయ నమః** - మంగలాన్ని కలిగించేందుకై ఉన్న ముప్పైమూడు దేవతా గణాలకీ అధిపతిగా ఉన్నవానికి....

## దూర్వా పూజ

జంటజంటగా గఱికెలని తీసుకుని వీటితోకూడా ఈ క్రింది ఇరవై ఒక్క నామాలనీ చదువుతూ పూజ చేయాలి. ఈ 'దూర్వాయుగ్మం' అంటే జంట గఱికె మన వినాయకునికి ఎంతెంతో ఇష్టమని ముందే అనుకున్నాంకదా! అర్థాన్ని తెలుసుకుంటూ పూజ చేద్దాం.

1. **ఓం సుముఖాయ నమః** - తనని నమ్మి వరాన్ని అడగదలచిన ఎవరికైనా సుముఖుడుగా ఉండేవానికి నమస్కారము.
2. **ఓం గ ణాధిపాయ నమః** - దేవతా గణాలకి అధిపుడైనవానికి....
3. **ఓం ఉమాపుత్రాయ నమః** - పార్వతీదేవికి పుత్రుడైనవానికి...
4. **ఓం గ జాననాయ నమః** - ఏనుగు ముఖం కలిగినవానికి...

5. ఓం హరసూనవే నమః - అజ్ఞానాన్ని హరించగల శక్తి ఉన్న శివునికి అదే లక్షణంతో పుత్రునిగా పుట్టినవానికి....

6. ఓం లంబోదరాయ నమః - వెడల్పుగా పెద్దగా వ్రేలాడే బొజ్జ కలిగినవానికి....

7. ఓం గుహాగ్రజాయ నమః - కుమారస్వామికి అన్నయైనవానికి....

8. ఓం గజకర్ణాయ నమః - ఏనుగు చెవులే తన చెవులుగా కలవానికి....

9. ఓం ఏకదంతాయ నమః - రెండు దంతాలు ఉండవలసి ఉన్నా ఒకే దంతంతో కన్పించేవానికి....

10. ఓం వికటాయ నమః - కష్టాలనీ, పాపాలనీ తొలగించేవానికి....

11. ఓం భిన్నదంతాయ నమః - తనకుతానే విఱుచుకున్న కారణంగా విఱిగిన దంతంకలిగినవానికి....

12. ఓం వటవే నమః - ఎప్పుడూ జ్ఞానాన్ని సంపాదించడమే ధ్యేయంగా కల వటువుగా ఉండేవానికి....

13. ఓం సర్వేశ్వరాయ నమః - చరాచరాలు ఉన్న ఈ జగత్తుమొత్తాన్ని పాలించేవానికి....

14. ఓం ఫాలచంద్రాయ నమః - నుదుటిపై చంద్రవంక కలవానికి....

15. ఓం హేరంబాయ నమః - కూర్చున్నప్పుడు తానే ఒక ధాన్యపు గాదెలాగా కన్పించేవానికి...

16. ఓం శూర్పకర్ణాయ నమః - అజ్ఞానాన్ని చెఱిగి జ్ఞానాన్ని మాత్రమే వినే విధంగా చేట చెవులు కలవానికి....

17. ఓం సురాగ్రజాయ నమః - సృష్టిని ప్రారంభించడానికి ముందుగా విఘ్నాలు లేకుండా ఉండేందుకై ఏ వినాయకుణ్ణి సృష్టించ వలసివచ్చిందో, ఆ కారణంగా దేవత లందఱికంటె ముందుగా పుట్టినవానికి....

18. ఓం ఇభవక్త్రాయ నమః - ఏనుగు ముఖమే తనకి ముఖంగా కలవానికి....

19. ఓం వినాయకాయ నమః - వినాయకుడనే పేరుగలవానికి....

20. ఓం సురసేవితాయ నమః - దేవతలందఱిచేతా సేవింపబడేవానికి....

21. ఓం కపిలాయ నమః - కపిల వర్ణపు శరీరచ్ఛాయ కలవానికి నమస్కారము....

## వ్రత కథ

అగ జానన ప ద్మార్కం గజానన మహర్నిశమ్।
అనేకదం తం భక్తానా మేకదంత ముపాస్మహే॥
అక్షతలని అందరికీ ఇచ్చి కథని చెప్పుకోవాలి.

అది నైమిశమనే పేరున్న అరణ్యం. మహర్షులంతా యాగం చేసి యాగం ముగిసిన వేళ విశ్రాంతిగా కూర్చుని ఉన్నారు. పక్కగా సరస్వతీనది ప్రవహిస్తూ వెళ్తోంది. అక్కడి వేదికమీద ఎన్నెన్నో విషయాలని అలా అలవోకగా చెప్పగల సూత మహర్షులవారు, శౌనకుడూ మొదలైన మహర్షులంతా అడిగిన ప్రశ్నలకి సమాధానాలని ఇస్తున్నారు. వాటిలో ఒకటే, ఇప్పుడు మనం చెప్పుకోబోయే ఈ కథా - విశేషాలున్నూ. ఆయన చెప్పడం ప్రారంభించారు.

శౌనకాది మహర్షులారా! ఒకప్పుడు 'గజ' అనే పేరుగల రాక్షసుడుండేవాడు. పేరుకి తగ్గట్టు వాని రూపం కూడ ఏనుగు ఆకారంలోనే ఉండేది. అమిత భక్తిపరుడైన గజాసురుడికి జీవితం అయిపోతూన్నా దేన్నీ సాధించలేకపోయాననే మనోవేదన అధికం కాసాగింది. ఆ కారణంగా శివుణ్ణి గూర్చి తపస్సు చేసాడు. బోళాశంకరుడు ప్రత్యక్షం కావడం, వరమీయడం అన్నీ చాల తక్కువ కాలంలోనే జరిగిపోయాయి.

వరం ఫలితంగా శంకరుడు ఆ గజాసురుని ఉదరం (బొజ్జ) లోపలనే ఉండవలసివచ్చాడు. పార్వతీదేవికి భర్తజాడ తెలియక ఆందోళన కలిగింది. వెంటనే ఆమె విష్ణువుతో మొఱపెట్టుకుంది.

రాక్షసుణ్ణి నొప్పించి కార్యం సాధించడం కంటె అతణ్ణి మెప్పించి విజయం సాధించడం తేలిక అని భావించిన విష్ణువు - పార్వతిని ఓదార్చి, తాను గంగిరెద్దులనాడించే వానిగానూ, నందీశ్వరుణ్ణి గంగిరెద్దుగానూ, దేవతలలో కొందఱిని తలొక్క వాయిద్యం వాయించే వారిగానూ సిద్ధపఱచి గజాసుర పురానికి బయలుదేరాడు.

వీరంతా చేసిన గానవినోదానికి ఆనందపడిన గజాసురుడు వరం కోరుకోవలసిందన్నాడు. అనడమే తడవుగా 'నీ ఉదరంలో ఉన్న శంకరుణ్ణే ఇప్పించు' అన్నాడు విష్ణువు. గజాసురునికి యథార్థం క్షణంలో అర్థమైంది. ఇది విష్ణుమాయ అని గమనించి చాల చింతించాడు.

వెంటనే తనలో ఉన్న శివుణ్ణి ఉద్దేశించి ' స్వామీ! నా శరీరం - నా శిరస్సూ శాశ్వతంగా ఉండేలా అనుగ్రహించవలసిందిగా ప్రార్థిస్తున్నాను. ఇదే నా చివరి కోరిక' అన్నాడు.

శంకరుడు దానికి అంగీకరించాడు. వెంటనే నందీశ్వరుడు తన కొమ్ములతో గజాసురుని పొట్ట చీల్చాడు. శంకరుడు విష్ణువుతో కైలాసంవైపు బయలుదేరాడు. **కష్టాన్ని కోరితెచ్చుకునే వరాలని ఈయరాదని శివుణ్ణి మెత్తగా మందలించాడు విష్ణువు.**

## లోకకథ

గజం నల్లని ఆకారంలో ఉంటుంది. అది తమోగుణానికి సంకేతం. అలాటి వారితో యుద్ధం చేయడం కంటె మెప్పించి పనులని చేసుకోవడం ఉచితం. పైగా గజాసురుడు మహా శివభక్తుడు. ఆ శివుణ్ణే తన ఉదరంలో ఉండవలసిందిగా కోరితే 'మాట తప్పక' అలాగే గజాసురుని బొజ్జలో ఉండిపోయాడు శివుడు.

తన బొజ్జలో మాట తప్పడమే ఎఱుగని శివుడున్న కారణంగా, 'మాట తప్పని తనం' అనే ఆ లక్షణమే తనకీ వచ్చింది. ఆ కారణంగానే విష్ణువు అడిగిన వరం వంచనతో కూడిందని తెలిసినా గజాసురుడు కాదనలేదు - మాట మార్చలేదు. శివోహమ్ (శివుని లక్షణాలే నావికూడా) అంటే ఇదే కదా!

ధర్మానికి ఎద్దు సంకేతం. శక్తికి అశ్వం సంకేతం. మనవద్ద ఉన్న నాణెంగాని నగదుకాగితం మీదగాని ఉన్న అశోక చక్రం అటూ ఇటూ ఎద్దూ - అశ్వం ఉంటాయి. ధర్మం ద్వారా శక్తిమంతులు కావాలని దీని భావమూ - శక్తి అనేది ధర్మాన్ని రక్షించేందుకూ రాజ్యాన్ని నిలిపేందుకూ తోడ్పడాలని దీని లక్ష్యమూను.

అలా ధర్మానికి సంకేతమైన ఎద్దు - 'తమో గుణం' నిండి కైలాసాధినేతనే తెచ్చి తనలో దాచుకోవడమనే అధర్మం ఉన్న గజాణ్ణి - చీల్చి చెండాడిందన్నమాట. అయితే ఈ తప్పిదంలో శంకరుని భాగస్వామ్యం కూడ ఉందిగా! అందుకే తమో గుణానికి ప్రతీక అయిన శంకరుణ్ణీ, అందునా సాక్షాత్తు ఆ లయకర్తనే వరం అడిగాడు అసురుడు 'తన శరీరమూ - తన తలా శాశ్వతం అయ్యేలా చేయవలసిం'దని.

గజాసురుడు తనకి ద్రోహమే చేస్తాడనే అభిప్రాయం శంకరునికి ఉండి ఉంటే, 'పొట్టలో ఉండిపోవడం వంటి' అలాటి వరం ఈయడం కుదరనే కుదరదని అని

ఉండేవాడే గదా! అంగీకరించడానికి కారణం - 'గజాసురుడు పేరుకి రాక్షసుడే గాని, చేతల్లో దర్భబద్ధవిధానమున్నవాడే - నని శంకరుడు భావించడమే. ఇలా మెత్తగా శంకరుణ్ణి వంచించి గజాసురుడు వరాన్ని పొందాడనే ఆ కారణంగానే విష్ణువు వాని వధకి ఉపాయం వేసాడు.

విష్ణువు శిశుపాలుణ్ణి చంపినట్టు తాను స్వయంగా చంపినా, విష్ణువు వృత్రాసురుణ్ణి చంపినట్టుగా మఱొకరితో చంపించినా, అలా చచ్చినవానికి మోక్షమనేది నిశ్చయం కదా! తమో గుణం నిండిన వాని ఆలోచనలు ఎప్పుడైనా 'వాని తల తెగితేనే కాని' మాఱవన్న మాట.

గజాసురుని తపస్సు 'శివుణ్ణి ఉదరంలో నిలుపుకోనేంతటిది' కానేకాదనే ఈ విషయాన్ని బ్రహ్మాది దేవతలందఱి సమక్షంలో నిరూపించదలచిన విష్ణువు, గజాసురుని వద్దకి తానై వచ్చి నడిపించిన ఈ కథ ద్వారా నిరూపించాడన్నమాట.

తానిచ్చిన మాట ప్రకారం గజ చర్మాన్నే కట్ట నిశ్చయించుకొన్నాడు శివుడు. అయితే గజాసురుని తలని మాత్రం ఏంచేయాలో ఆ విషయాన్ని గుఱించి శంకరుడింకా అప్పటికి నిర్ణయించుకోనేలేదు.

## 2

గజాసురవధ అయిందని తెలిసీ - శంకరుడు వస్తూన్నాడని వినీ - పార్వతి అభ్యంగన స్నానం చేసి నూత్న వస్త్రాలని ధరించి ఆయనకు స్వాగతం చెప్పాలని నిశ్చయించుకుంది. ఆమె స్నానానికి వెళ్లబోతూ తన ఒంటిని నలిచిన నలుగుతో ఒక బొమ్మని ఏర్పఱచి దానికి ప్రాణం పోసి ద్వారం వద్ద కాపుంచింది.

శంకరుడు రానే వచ్చాడు. అడ్డగించిన బాలునితలని శూలంతో ఖండించి పార్వతీ మందిరానికి వెళ్లాడు. ఏదో ప్రసంగవశంగా బాలకుని విషయం రాగా పార్వతి హతాశురాలయింది. ఆ గజాసురుని శిరస్సు లోకపూజ్యతని పొందవలసిఉంది కాబట్టే ఇలా జరిగి ఉంటుందని గమనించి అతని తలని తెచ్చి ఈ బాలకునికి పెట్టి ప్రాణం పోసాడు శివుడు.

గజముఖమే తన ముఖంగా కలిగినవాడు కాబట్టి గజాననుడూ - గజముఖుడూ - దంతి ముఖుడూ - హస్తిముఖుడూ - అని ఇలాంటి పేర్లు కలవాడయ్యాడు వినాయకుడు.

## విశేషాలు

తన నలుగు మట్టికి ప్రాణసృష్టిని మాత్రమే చేసింది అమ్మ. ప్రాణం పోయిన గజాసురుని తలలో ప్రాణ సృష్టినీ - ప్రాణం పోయిన వినాయకునికి ఆ తలని తెచ్చి అతికించి అతని జీవిత స్థితినీ - తనని అడ్డగించిన బాలకుని తలని శూలంతో నరికి లయాన్నీ కూడా చేసాడు అయ్య.

**ఒకప్పుడు అయ్యవారి చేతిలో లయం అయిన మన్మథుణ్ణి బ్రతికించింది అమ్మ. ఇక్కడ అమ్మ బ్రతికించిన బాలకుణ్ణి లయం చేసాడు అయ్య. అయ్య వలన బ్రతికిన మన గణపతి శివ పుత్రుడైతే, అమ్మవలన బ్రతికిన మన్మథుడు కేశవపుత్రుడు.**

### 3

ఒకప్పుడు దేవతలూ, మహర్షులూ, ఇతర దేవతాగణాలూ (33) పరమేశ్వరుణ్ణి ప్రార్థించి తమ అందరికీ అధిపతిగా ఒకరిని నియమించవలసిందని కోరారు. ఆ సంభాషణని అక్కడే ఉండి వింటూ ఉన్న వినాయకుడూ, అతని తమ్ముడు కుమారస్వామీ 'నేనంటే నేను తగుదును' అని వాదులాడుకోసాగారు. ఒకరి తక్కువ దనాన్ని వేరొకరు ఎత్తి పొడుచుకోవడం ప్రారంభించారు.

దాన్ని గమనించిన శంకరుడు వారిద్దరికీ ఒక నియమాన్ని ఏర్పాటుచేసాడు. 'భూమండలంలో ఉన్న నదీనదాల్లోనూ సముద్రాలన్నింటిలోనూ స్నానమాడి ఎవరుముందుగా శంకరుని వద్దకు వస్తే' వారికి ఆ పదవి లభిస్తుంది అనేది ఆ నియమం.

ఆ నియమాన్ని వింటూనే నెమిలి వాహనం మీద వాయువేగంతో ఎగిరిపోయాడు కుమార స్వామి. ఇక అంత పెద్ద బొజ్జ - పొట్టికాళ్లతో ఎలుక వాహనంతో ఉన్న వినాయకుడు మాత్రం ఏమీ చేయలేనివాడై కళ్లనీళ్లు పెట్టుకుంటూ, గౌరీ శంకరుల ప్రదక్షిణమే తనకు విజయ రహస్యం అని భావించి, తన తలిదండ్రులకే ప్రదక్షిణం చేయసాగాడు.

**పక్ర్వ్వారాయ ణే త్యుక్త్వా పుమాన్కల్ప శతత్రయమ్।**
**గం గాది సర్వతీర్థేషు స్నాతో భవతి పుత్రకో॥**

వినాయకుని పరిస్థితిని గమనించిన శంకరుడు అతనితో 'నాయనా! మనః పూర్వకంగా ఒక్కమాటు నీళ్లే స్థానంగా ఉన్న నారాయణుణ్ణి ధ్యానిస్తే గంగానది మొదలు సర్వనదీనద సముద్రాల్లోనూ స్నానం చేసినట్లవుతుంది.' అంటూ నారాయణ శబ్దంలో ఉన్న మాహాత్మ్యాన్ని చెప్పాడు. ఆ నారాయణ జపాన్ని చేస్తూ వినాయకుడు తన తలిదండ్రులకే ప్రదక్షిణం చేయసాగాడు.

ఇక కుమారస్వామి ఏ నది - నదం - సముద్రంలో స్నానం చేయడానికి నీటిలోనికి దిగబోతూన్నా అప్పటికే స్నానం ముగించుకొని ఒళ్లు తుడుచుకుంటూన్న వినాయకుడు అతనికి కన్పించసాగాడు. నియమం ప్రకారం కుమారస్వామి అన్ని చోట్లా స్నానాన్ని ముగించి కైలాసానికి వచ్చి తన ఓటమిని తానే అంగీకరించాడు. వినాయకుడు గణాధిపతిగా నియమించబడ్డాడు.

ఈ విజయానికి సంతోషించిన దేవగణాలంతా ఎవరిమటుకు వారు వేలువేలుగా విందులని ఏర్పాటు చేస్తే, ఎవరినీ కాదన(లే)క, భోజనప్రియుడు కావడంతో పూర్తిగా విందులనన్నింటినీ ఆరగించి తలిదండ్రులవద్దకి వచ్చాడు గణపతి. అలా రావడమేకాక 'ఈ విజయానికి వారి అనుగ్రహమే కారణ'మనే కృతజ్ఞతా భావనతో సాష్టాంగపడ్డాడు.

బొజ్జ పెద్దది కావడంతో నేలకి తల ఆనితే కాళ్లు పైకి తేలిపోసాగాయి. కాళ్లని బలవంతానా నేలకి ఆనిస్తే తల తేలిపోసాగింది. ఈ అవస్థకి పైనున్న చంద్రునికి నవ్వు ఆగలేదు. పెద్దగా నవ్వనే నవ్వాడు. ఆ అపహాస్యానికి కోపించిన పార్వతి, చంద్రుణ్ణి చూసినవారికి నీలాపనిందలు కలుగుతాయని శపించింది.

ఆ శాపం ఫలితంగా - ఎక్కడ లేనిపోని నిందలు వచ్చిపడతాయోనని చంద్రుణ్ణీ ఏ రాత్రీ ఏ ఒక్కరూ కూడ చూడడం మానేసారు. ఈ శాపం వలన ప్రజలంతా ఎంతో ఇబ్బందిని పడసాగారు కూడ. (ఇలా కృతయుగంలో జరిగి ఉండవచ్చు).

## విశేషాలు

శరీరబలమూ బుద్ధి బలమూ పోటీపడితే శరీరబలం (కుమారస్వామి) కంటె బుద్ధిబలమే (వినాయకుడు) గొప్పదై గెలుస్తుందని దీనిద్వారా తెలుస్తుంది. మన బలం మీద మనకి ఎంతగా నమ్మకమున్నా దానికి దైవం అనుకూలించనిదే విజయం సిద్ధించదన్నమాట. లేని పక్షంలో కుమారస్వామికే విజయం లభించి ఉండేది గదా!

విజయం సిద్ధించాలంటే తలిదండ్రులయెడ భక్తి గౌరవాలుండడం, వారి ఆశీస్సులని పొందడం తప్పనిసరి అని ఈ కథ తెలియజేస్తుంది. తమ సంతానానికి మించి, మఱి విజయం సిద్ధించాలని తలిదండ్రులు ఇంకెవరిని దీవిస్తారు గనుక? శివుడు నారాయణ మంత్రాన్ని ఉపదేశించడానికి ఏ మాత్రమూ సంకోచించలేదనీ, అసలు సంకోచపడడమనేది ఒకటుంటుందనీ ఆయనకే తెలియకపోతే, తెలిసి తెలియని శైవులూ, తెలిసితెలియని వైష్ణవులూ శైవవైష్ణవ భేదంతో ఉంటూ, మనలో మనకి అనవసరభేదాన్ని తెచ్చిపెడుతున్నారనేగా అర్థం! గమనించగలగాలి.

ఎందఱికో అసౌకర్యం కలుగుతుందని తెలిసినా పార్వతి చంద్రదర్శనాన్ని నిషేధించిందంటే, తన సంతానం విషయం వద్దకి వచ్చేసరికి తల్లి మఱి ఏ విషయాన్నీ సంతానానికి మించినదానినిగా లక్ష్య పెట్టదని భావమన్నమాట. వసు-రుద్ర-ఆదిత్య-మరుత్-యక్ష-కింనర-కింపురుష ... ఇలా ఉన్న కోటులు (సమూహాలు) 33. (ఏ సమూహానికి ఆ సమూహం చొప్పున మొత్తం ఉన్న సమూహాలు 33) దీన్ని సరిగా అర్థం చేసుకోకుండా - కోటులు అనే పదానికి 'వంద లక్షలు' అని సంఖ్యాపరంగా అర్థం చేసుకుని - దేవతలు ముప్పైమూడు కోట్లు (ముప్పైమూడు వందల లక్షలు) అని పల్కడం అవివేకమే కదా!

## 4

పార్వతి శాపం కారణంగా ఎవ్వరూ చంద్రుణ్ణి ఏ రాత్రీ దర్శించకుండా చాలా జాగ్రతతో కాలం గడపసాగారు. అయితే ఒకసారి యాగాలు సాగుతూ ఉన్నపుడు అగ్నిదేవునికి తమ భార్యలతో సప్తమహర్షులూ ప్రదక్షిణాలుచేయసాగారు. యజ్ఞగుండంలో వేసిన నెయ్యి అధికం కావడంతో అగ్ని మఱింతగా పెరిగి మహర్షుల భార్యలకి తగిలాడు. అంటే అగ్ని జ్వాలలు వారికి తగిలాయన్నమాట.

దీనితో అగ్నిహోత్రునికే అపనింద వచ్చింది. పరోక్షంగా ఋషులకు కూడా తమ భార్యలపై శంక కలిగింది. దీనితో నారందఱూ పార్వతిని శాపాన్ని ఉపసంహరింపవలసిందిగా ప్రార్థించారు.

జగన్మంగల అయిన ఆమె ప్రసన్నురాలై 'ఏరోజున - అంటే భాద్రపద శుద్ధ చవితినాడు - తన పుత్రుణ్ణి చూచి చంద్రుడు అపహాస్యం చేసాడో ఆ రోజున మాత్రం చంద్రుణ్ణి చూడరా'దని ఆమె తన శాపాన్ని సడలించింది. అంతటితో తృప్తిపడ్డ మహర్షులు వెళ్లిపోయారు. ఈ సడలింపు త్రేతాయుగంలో బహుశః జరిగి ఉండవచ్చు.

## విశేషం

'లోకాపవాదా ద్భయమ్' అన్నింటికంటె మించినది అపనింద. దాని విషయంలో ప్రతి వ్యక్తీ చాలా శ్రద్ధతో ఉండాలని ఈ కథ తెల్పుతుంది. మానసికంగా మహావ్యథని కల్గించేదే అపనింద. అంటే ఆ అపనింద మహర్షులంతటి వారిని కూడా సామాన్యులనుగా చేస్తూ భార్యల విషయంలో శంకిచేంతదిగా చేసింది. సర్వాన్నీ భక్షించే సామర్థ్యం ఉన్న అగ్నిహోత్రుని క్కూడా ఆ అపనింద మ్రింగుడు పడలేదు.

అతి మూల్యమైన బంగారాన్నీ, అతి పవిత్రురాలైన సీతమ్మనీ కూడా పవిత్రతలో పరీక్షించి నిగ్గు తేల్చే అగ్నిహోత్రుణ్ణి కూడా అపనింద ఆవహించిందంటే అపనింద ఎంతటిదో గుర్తించగలగాలి.

ఇక ఇక్కడి కథ మరో తీరుగా కూడా కొన్నిచోట్ల కన్పిస్తోంది. చంద్రుడు వినాయకుణ్ణి చూచి నవ్వగానే ఆ దృష్టిదోషానికి వినాయకుడు మృతుడయ్యాడనీ, బ్రహ్మ బ్రతికించాడనీను. గణాధిపతి అయినవాడు మృతినందడం, అందునా శంకరుడు ప్రాణప్రతిష్ఠ చేయగా పునర్జీవితుడైనవాడు మృతి నందడం అనేది ఏ మాత్రమూ సరికాదు కాబట్టి ఆ తీరు కథ సరికాదని గమనించాలి.

## 5

ద్వాపర యుగంలో నివసిస్తూన్న కృష్ణుడు భాద్రపదశుద్ధ చవితిని గమనించి ఆ రోజున చంద్రుణ్ణి ఎవరూ చూడరాదనీ, అపనింద రావచ్చుననీ చాటింపు వేయించాడు. కాని - తానే గోశాలలో తలవంచుకొని పాలను పితుకుతూ ఆ పాలలో చంద్రుని బింబాన్ని చూచాడు. ఏ అపనింద రాబోతోందో? అని భయపడుతూనే ఆ రాత్రి నిద్రించాడు.

ఇది ఇలా ఉండగా, ద్వారకానగరంలో సత్రాజిత్తు అనే పేరుగల రాజు సూర్యుణ్ణి ఆరాధించి స్యమంతకమనే పేరుగల మణిని సూర్యునినుండి బహుమతిగా పొందాడు. రోజూ ఎనిమిది బారువుల బంగారాన్ని ఆ మణి సృష్టిస్తూ ఉంటుంది. దానిని ఒకనాడు సత్రాజిత్తు కృష్ణునికి చూపించాడు. కృష్ణుడు దానిని చూచి ఆ దేశపు రాజుకీయవలసిందిగా సూచించాడు. ఆ మణి కారణంగా కలవు ఉండవనేది కృష్ణునికి తెలిపి అలా అన్నాడు.

కొన్నాళ్లకి సత్రాజిత్తుకి తమ్ముడు ప్రసేనుడు ఈ మణిని ధరించి వేటకెళ్లాడు. అక్కడ ఒక సింహం ప్రసేనుని మెడలో మణికాంతిని గమనించి ఏదో అనుకుని అతణ్ణి చంపి మణిని తీసుకునిపోయింది. జాంబవంతుడనే పేరుగల ఎలుగుబంటి ఆ మణిని చూచి మతేమో అనుకుని ఆ సింహాన్ని చంపి మణిని తీసుకునిపోయి - తన పుత్రిక జాంబవతి విలాసంగా ఊగే ఉయ్యాలకి - వినోదంగా ఉండే బొమ్మగా ఉంటుందని తగిలించాడు.

ఎన్నాళ్లయినా తన తమ్ముడు రాకపోయేసరికి సత్రాజిత్తుకి అనుమానం కల్గింది. ఎవరితోనో ఒకరితో అన్నాడు 'ఆరోజున కృష్ణుడు సూచించింది నచ్చక నేను చేయలేదు. ఈ మణీ కన్పించడంలేదు - నాతమ్ముడూ ఇంటికి రాలేదు' అని. ఆయన పెదవి దాటిన ఈ వార్త పృథివి దాటి వెళ్లిపోనేపోయింది. ఈ వార్త వింటూనే కృష్ణునికి ఆ గోశాలలో క్షీరంలో చూచిన చంద్రబింబ వృత్తాంతం గుర్తొచ్చింది.

మఱునాడే కొందఱిని వెంటబెట్టుకొని వెళ్లి యథార్థాన్ని గ్రహించి జాంబవంతునితో పోరాడి గెల్చి, బహుమతిగా అతని పుత్రిక జాంబవతితో కూడా స్యమంతకాన్ని సత్రాజిత్తుకి అందఱి సమక్షంలోనూ ఇచ్చాడు. సత్రాజిత్తు సిగ్గుపడి, మన్నింపవేడి తన కూతురు సత్యభామతోపాటు స్యమంతకాన్నీ కృష్ణునికే తిరిగి ఇచ్చివేసాడు కృష్ణుడు. సత్యభామని మాత్రం స్వీకరించి మణిని అతనికే ఇచ్చివేసాడు కృష్ణుడు.

అప్పుడు మహర్షులంతా కృష్ణుణ్ణే ప్రార్థించి ఈ చంద్రుణ్ణి చూడరాని నియమాన్ని తొలగించవలసిందన్నారు. కృష్ణుడు బదులు పలుకుతూ 'భాద్రపద శుద్ధ చవితినాడు ఎవరు ఈ వినాయక వ్రతకథని విని ఆ అక్షతలని తలను ధరిస్తారో వారికి ఏవిధమైన అపనిందలూ ఉండబోవని' పార్వతి శాపపు నియమాన్ని దాదాపు సడలించాడు.

ఇది ద్వాపరయుగంలో జరిగిన విశేషం. అప్పటినుండి క్రమం తప్పక ప్రతిసంవత్సరమూ వచ్చే వినాయక చవితి పూజని చేసి కథని విని ఆ అక్షతలని మానవులంతా తమ తమ తలలలో ధరిస్తూనే ఉన్నారు.

## విశేషం

దేవుడు కూడా నింద వచ్చిందని భయపడ్డాడా? అయినా ఆయనకి నింద రావడం ఏమిటి? అనుకోకూడదు. నిజానికి భగవంతుడు నిందకి అతీతుడు. నిందకి లోబడేవాడు కాదు. అయితే మనకి ఒక కథని చెప్పి తద్వారా మనం నడుచుకోవలసిన

విధానాన్ని చెప్పవలసిన వాడు కాబట్టి, నింద వచ్చినట్టూ - దానిని తాను తొలగించుకున్నట్టూ - తనకి తానే ఒక నటనని చేసాడు. పిల్లవాడు తలుపు చాటునుండి అఱవగానే, ఆ పిల్లవాని తండ్రి 'కావాలని భయపడి' వాడికి సంతోషాన్ని కలిగించినట్టే ఇదికూడా ఒక నాటకమే.

లోకోత్తరమైన మణిని తనకీయవలసిందనలేదుకృష్ణుడు. ఆ దేశపు రాజుకీయవలసిందిగా సూచించాడు. వ్యక్తికి ఇస్తే అది ఆ వ్యక్తికే తోడ్పడుతుంది. అదే ఆ దేశపు రాజుకిస్తే ఆ మణి ప్రయోజనాన్ని, ఆ రాజు ఆ దేశ ప్రజలందఱికీ కలిగిస్తాడనేది కృష్ణుని ఆలోచన. ఎంత చక్కని విశాల దృష్టి ఆయనది!

కఱవు కాటకాలని తొలగించే మణి దేశాన్ని ఏలే రాజువద్ద లేకపోయాక సింహం మెడలో ఉన్నా, ఊయలకి ఆభరణంగా ఉన్నా అది వ్యర్థమే కదా! సమర్థుడు కానివానికి మణి విలువ ఇంతకంటే తెలియదని ఈ కథ చెప్తుంది. కుక్కుటస్య రత్నలాభేన - కోడికి రత్నం కనిపిస్తే ముక్కుతో అటూ ఇటూ రెండుసార్లు దొర్లించి కాలితో తన్ని వెళ్లిపోతుందట. ఇదీ అంతే.

'ఎరవు సొమ్ము బరువు చేటు' అనే సామెత ఇక్కడిదే. తనదికాని సొమ్ముని తాను మెడలో వేసుకున్న కారణంగా ప్రసేనుని ప్రాణాలే పోయాయి. అలాగే తనది కాని సొమ్ముని దౌర్జన్యంగా తాను తీసుకున్న కారణంగా జాంబవంతుడు కృష్ణుని ముష్టి ఘాతాలని తినవలసివచ్చాడు. మణి ఒక వ్యక్తి ప్రాణాన్ని తీయడం బట్టైనా గమనించాలి 'మణికంటే ప్రాణం విలువైనది' అని. అంతేకాదు.

సుఖమైన ప్రాణం దుఃఖాలపాలు పడాలంటే విలువైన బంగారాన్నో, మణినో మెడలో వేసుకుంటే చాలన్నమాట. చిత్రమేమంటే ఎంతో విలువైన ప్రాణాన్ని తీసే బంగారం, ప్రాణమంత విలువైనది ఎన్నటికీ కాదు. మఱో విశేషం కూడ. ఈ బంగారమే తనదికానిదైతే, ప్రాణాలు పోవడంతోపాటు తన వంశం వారందఱికీ కూడ అపనిందని కల్గిస్తుంది. కథని కథగానే వింటే ప్రయోజనం లేనేలేదు. దాన్ని మన జీవితానికి అన్వయించుకుని సరైన మార్గంలో ప్రయాణించడానికి ఆ కథని మార్గదర్శక సూత్రంగా ఉపయోగించుకోవాలన్నమాట. ప్రాచీనుల కథలన్నీ ఈ మూల సూత్రం ఆధారంగా వ్రాయబడినవే.

సత్రాజిత్తుకి కృష్ణుని మీద అపనిందవేయడమే వచ్చు. ప్రసేనునికి మణితో వెళ్లి మరణించడమే వచ్చు. కృష్ణునికి మణిని తెచ్చీయడమే కాక జాంబవతిని బహుమతిని పొందడం కూడవచ్చు. అపనింద వేసేవానికి అపనింద వేయడమే తప్ప, ఒక పనిని సాధించే సామర్థ్యం ఏ మాత్రమూ ఉండదని ఈ కథ చెప్తుంది.

మణిని తెచ్చాక ఆ మణిని కృష్ణుడు అందరి సమక్షంలోనూ సత్రాజిత్తుకి అందజేయడానికి కారణం మరోసారి నింద పడకుండా ఉండేందుకే. ఒకరి నగని తీసుకోవడం ఎంత తప్పో, దాన్ని తిరిగి ఇచ్చేటప్పుడు ఎవ్వరూ లేకుండా ఈయడం కూడా అంతే తప్పు. ఇలాటి కథలని మనకి చిన్నతనం నుండీ నేర్పవలసిందిగా చెప్తూ చక్కని జీవిత విధానాన్ని దేవతలూ మహర్షులూ ఏర్పరిచారంటే ఎన్నెన్ని కృతజ్ఞతలని వారికి చెప్పుకోవాలో కదా!

**అగ జానన ప ద్మార్కం గజానన మహర్నిశమ్ ।**

**అనేకదం తం భక్తానా మేకదంత ముపాస్మహే ॥**

కొబ్బరి కాయలు కొట్టాలి. అక్షతలని దేవునిపై కొన్నింటిని వేసి మిగిలిన వాటిని ఇంట్లోని పెద్దవారికిచ్చి వారికి నమస్కరించి తలపై వేయించుకోవాలి. ఇలాంటివి చేస్తూంటే తలిదండ్రులకి నమస్కరించడం అనేది అలవాటై ఎబ్బెట్టుగా అనిపించదు.

**ద శాంగం గుగ్గు లోపేతం సుగంధం సుమనోహరం।**

**ఉమాసుత! నమ స్తుభ్యం గృహాణ। వరదో భవ॥ - ధూప మాఘ్రాపయామి.**

అగరువత్తులని వెలిగించి ధూపాన్నీయాలి.

**సా జ్యం త్రివర్తిసంయుక్తం వహ్నినా యోజితం మయా।**

**గృహాణ మఙ్గలం దీప మీశపుత్ర! నమో స్తు! తే॥ - దీపం దర్శయామి.**

నూనె లేదా నేయితో వెలిగించిన దీపాన్ని చూపించాలి. కైవత్తులని కూడా వెల్గించి ఆయనకు చూపించాలి. ఇక మహానైవేద్యం.

**సుగన్ధాన్సుకృతాం శ్చైవ మోదకాన్ ఘృతపాచితాన్।**

**నైవేద్యం గృహ్యతాం దేవ! చణముద్గైః ప్రకల్పితాన్॥**

**భక్ష్యం భోజ్యం చ లేహ్యం చ చోష్యం పానీయమేవ చ।**

**ఇదం గృహాణ నైవేద్యం మయా దత్తం వినాయక! - నైవేద్యం సమర్పయామి.**

భక్ష్యం (ఉండ్రాళ్లూ) భోజ్యం (నమిలి తినవీలైన కజ్జికాయలూ...) లేహ్యం (నాలుకతో నాకి తినే వీలైన క్షీరాన్నం లేదా పరమాన్నం) చోష్యం (పులుసు) పానీయం (త్రాగవీలైన పాయసం) తోపాటు కూరా-పప్పూ- ఇంకా ఇతర పదార్థాలతో నిండిన మహానివేదనాన్ని సమర్పిస్తున్నామ అని అంటూ ఆహార పదార్థాలన్నింటిపైనా అలా నీళ్లని సన్నగా చల్లి -

ప్రాణాయ నమః - అపానాయ నమః - వ్యానాయ నమః - ఉదానాయ నమః - సమానాయ నమః అంటూ చేతిని భగవంతునకు స్వీకరించవలసినదిగా సూచిస్తూ చూపాలి.

మధ్యే మధ్యే పానీయం సమర్పయామి అంటూ నీటిని ఒక పాత్రలో వేయాలి. **ఉత్తరాపిధానమసి - హస్తౌ ప్రక్షాళయామి - పాదౌ ప్రక్షాళయామి - ముఖే ఆచమనీయం** సమర్పయామి అంటూ మళ్లీ ఒక ఉద్ధరిణెడు నీటిని ఒక పాత్రలో వేయాలి.

భోజనంచేస్తూ మధ్య మధ్యలో నీటిని త్రాగాలనీ, భోజనం ముగించాక చేతులనీ, కాళ్లనీ కడుగుకోవడమే కాక, మళ్లీ మంచి నీటిని త్రాగాలని ఈ నివేదన ఘట్టం మనకి పరోక్షంగా తెలియచేస్తుంది.

**స దానందద వి ఘ్నేశ! పుష్కలాని ధనాని చ।**

**భూమ్యాం స్థితాని భగవన్! స్వీకురుష్వ వినాయక! - సువర్ణపుష్పం సమర్పయామి.**

నాకు ప్రాప్తించవలసిన ధనధాన్య భూ ఐశ్వర్యాలని ప్రసాదించవలసినదిగా ప్రార్థిస్తూ మంత్ర పుష్పాన్నిస్తున్నాను. అంటూ పుష్పాలని ఆయనపై వేయాలి.

**పూగీఫలసమాయుక్తం నాగవల్లీ దళై ర్యుతమ్।**

**కర్పూరచూర్ణసంయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్॥ - తాంబూలం సమర్పయామి.**

తాంబూలాన్ని అందియ్యాలి.

**ఘృతవర్తి సహస్రై శ్చ కర్పూరశకలై స్తథా।**

**నీరాజనం మయా దత్తం గృహాణ వరదో భవ! - నీరాజనం సమర్పయామి.**

నీరాజనాన్ని (హారతి) అందిస్తున్నాను.

**అర్ఘ్యం గృహాణ హేరంబ! సర్వభద్రప్రదాయక!**

**గన్ధ పుష్పాక్షతై ర్యుక్తం పాత్రస్థం పాపనాశన! - పున రర్ఘ్యం సమర్పయామి.**

పూజ అయ్యేంత వరకూ ఉండి మహానివేదనాన్ని స్వీకరించిన నీకు తిరిగి అర్ఘ్యాన్ని సమర్పిస్తున్నాను. 'స్వీకరించు' అంటూ తములపాకుతో నీటిని - అర్ఘ్యాన్ని - ఇయ్యాలి.

**నమ స్తుభ్యం గణేశాయ నమ స్తే! విఘ్ననాశన!**

**ఈప్సితం మే వరం దేహి పరత్ర చ పరాం గతిమ్॥ - ప్రార్థనాం నివేదయామి.**

మనసులోని కోర్కెని ఒకరి పిమ్మట ఒకరు మౌనంగా వెల్లడించుకోవాలి.

**వినాయక! నమ స్తుభ్యం సతతం మోదకప్రియ!**

**నిర్విఘ్నం కురు మే దేవ! సర్వకార్యేషు సర్వదా॥ - వాయనదానం కరోమి.**

**గణేశః ప్రతి గృహ్ణాతు గణేశో వై దదాతి చ।**

**గణేశ స్తారకో ద్వాభ్యాం గణేశాయ నమో నమః॥**

**వినాయకస్య ప్రతిమాం వస్త్రయుగ్మ సమన్వితామ్।**

**తుభ్యం దాస్యామి విప్రేంద్ర! య థోక్త ఫలదో భవ॥ - ప్రతిమాదానం కరోమి.**

వినాయకుని ముందు ఉండ్రాళ్లని పెట్టి వాటిని ప్రత్యేకంగా ఆయనకు ఈయాలి. ఆ వాయనాన్ని వినాయకుడే గ్రహిస్తున్నట్లు భావించాలి. ఇది వ్రతం కాబట్టి వాయనమివ్వాలి పూజ చేసిన వినాయకుని బొమ్మని కాక మరో వినాయకుని బొమ్మని పురోహితుల వారికి దానంగా ఈయాలి.

ఆయన నిత్యమూ పూజచేసేప్పుడు, మనం దానంగా ఇచ్చిన ఈ వినాయకుణ్ణి చూస్తూ, మనని స్మరిస్తూ ఉంటారు గనుకా - మన వినాయకుడు నిత్యమూ అక్కడ పూజింపబడుతాడు గనుకా - జంట వస్త్రాలతో కలిపి పూజ చేయించిన పురోహితుల వారికి దక్షిణతో ఇవ్వాలన్నమాట.

**యాని కాని చ పాపాని జన్మాంతర కృతాని చ।**

**తాని తాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదేపదే॥**

**పా పోహం పాపక ర్మాహం పా పాత్మా పాప సంభవః।**

**త్రాహి మాం కృపయా దేవ శర ణాగత వత్సల!**

**అన్యథా శరణం నా స్తి త్వమేవ శరణం మమ॥**

**తస్మాత్ కారుణ్యభావేన రక్ష! రక్ష! గణాధిప! - ప్రదక్షిణ నమస్కారాన్సమర్పయామి**

తెలియని ఎన్నెన్నో జన్మలలోనూ, అలాగే ఈ జన్మలోనూ చేసిన పాపాలు ఒక్కొక్కటీ తొలగడం కోసం నేను ఈ దేవునికి ఒక్కొక్క ప్రదక్షిణనీ చేస్తూ ఉన్నాను. పరమాత్మ మన హృదయంలోనే ఉన్నాడు కాబట్టి, ఆయనకి మన చూపుతో ప్రదక్షిణాన్ని చేస్తూన్నట్లు మన మనసులో భావించాలి.

**యస్య స్మృత్యా చ నా మోక్త్యా తపః పూజా క్రియాదిషు।**

**న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వందే త మచ్యుతమ్॥**

**అనేన ఆరాధనేన భగవాన్ గణాధిపః సుప్రీతః సుప్రసన్నః వరదో భవతు!**

ఈ చేసిన పూజలో ఏ విధమైన లోపం ఉన్నా, దాన్ని తెలియక చేసినదానిగానే భావించి ఫలితాన్ని దయతో ఈయ ప్రార్థిస్తున్నానని వినాయకునితో మౌనంగా మనసుద్వారా నివేదించుకోవాలి..

## విఘ్నేశ్వరునికి మంగలహారతులు

**(✱ ఉన్నచోట "జయమంగలం నిత్యశుభ మంగలం" అవాలి.)**

శ్రీశంభు తనయునకు సిద్ధి గణ నాథునకు - వాసి గల దేవతావంద్యునకునూ
ఆ సరస విద్యలకు ఆదిగురువైనట్టి భూసురోత్తమ లోకపూజ్యునకునూ ✱
వెండి పళ్లెమ్ములో వేవేల ముత్యాలు కొండలుగ నీలాలు కలియబోసి
మెండుగను హారములు మెడనిండ వేసికొని దండిగను నీకిత్తు ధవళారతీ ✱
ఏకదంతమ్మునూ శ్రేష్ఠ గజవదనంబు బాగైన తుండంబు వలపు కడుపూ
జోకైన మూషికము పారిది నెక్కాడుచును భవ్యుడగు దేవగణపతికి నిపుడూ ✱
బంగారు చెంబుతో గంగోదకము దెచ్చి సంగతిగ శివునకూ జలకమార్చి
మల్లెపూవులు దెచ్చి మురహరిని పూజింతు రంగైన నా ప్రాణలింగమునకూ ✱
దేవాధిదేవునకు దేవతారాధ్యునకు దేవేంద్ర వంద్యునకు దేవునకునూ
దేవతలు మిముగొల్చి తెలిసి పూజింతురూ భవ్యుడగు దేవగణపతికి నిపుడూ ✱
ఓ బొజ్జ గణపతీ! ఓర్మితో రక్షించి కాచి మమ్మేలుమీ కరుణతోనూ
మా పాలగలవనీ మహిమీద నెల్లపుడు కొనియాడుచుందుమూ కోర్కెదీరా
సుచిరముగ భాద్రపద శుద్ధ చవితీ యందు పొసగ సజ్జనులచే పూజగొల్తూ ✱

**"జయమంగలం నిత్యశుభ మంగలం" "జయమంగలం నిత్యశుభ మంగలమ్"**

ఎవరితోనో ఒక మంగల హారతి ఇప్పించాలి. ఇంకేదైనా మంగల హారతి పాట పాడుకోవచ్చు కూడ.

పసుపు వినాయకుణ్ణి నీటితో తడిపి పిల్లల పుస్తకాలమీదా, ముఖ్యమైన వాటిమీదా ఓం అని వ్రాయడంగాని లేదా పుస్తకానికి ఒక చుక్క చొప్పున పెట్టడం గాని చేయాలి. నూతన వస్త్రాభరణాలన్నింటికీ కూడా ఈ పసుపు చుక్కనే పెట్టుకోవాలి.

కలశంలోని నీటిలో తేనే - పంచదారా - పెరుగూ - పాలూ - నెయ్యీ వేసి దేవునికి చూపించి తీర్థంగానూ, నివేదన పెట్టిన ఫలాలన్నింటినీ ప్రసాదంగానూ భావించాలి. అందరూ స్వీకరించాలి.

వినాయక వ్రతాన్ని ఈ చవితినాడే కాక ప్రతిశుద్ధ -బహుల చవితి రోజుల్లోనూ కూడా చేస్తే ఆ ఫలితం మఱువలేనిది. అయితే ప్రతి చవితికీ ఉండ్రాళ్లూ - ఇంత వ్యయ ప్రయాసలూ అక్కఱలేదని గమనించాలి.

సాయంకాలం సరిగా సూర్యాస్తమయకాలంలో మళ్లీ అష్టోత్తర నామాలని మాత్రం చదివి హారతినియ్యాలి. మఱునాడు ప్రొద్దున కూడా అష్టోత్తరాన్ని చదివి హారతి నిచ్చి, వినాయకుణ్ణి కొద్దిగా ఆయన ఉన్న చోటునుండి కదపాలి.

ఇక నిమజ్జనం చేయవచ్చు. ఇంతటితో ఈ సంవత్సరానికి వినాయక వ్రతం అయినట్లూ - పై సంవత్సరం మళ్లీ వరసిద్ధి వినాయకుణ్ణి వ్రతానికీ పూజకీ పిలువబోతున్నానని చెప్తున్నట్లూ దీని అర్థం.

ఆ మట్టి వినాయకుణ్ణి పత్రితో సహా పాటే నీటిలో వేయాలి. లేని పక్షంలో నూతిలోనైనా వేయవచ్చు. పూర్వుల గొప్పదనం ఇక్కడ కూడా కన్పిస్తుంది. మట్టి వినాయకుడైతే నీళ్లలో కరిగిపోతాడు. ఈ కారణంగా చెరువులనీ - నదులనీ లేదా నూతులనీ శుభ్రం చేయడంకోసం . . . నదుల్లోనూ చెఱువుల్లోనూ ఇంకా నూతుల్లోనూ కూడా దిగే వారికి ఏ అసౌకర్యమూ ఉండదు గదా!

**అర్థాన్ని తెలుసుకుంటూ శ్రద్ధతో ఇంత చక్కగా మనచేత పూజలందుకున్న మన వినాయకుడు మనందరినీ చల్లగా చూడాలని మఱొకమాఱు ఆయనని ప్రార్థిద్దాం.**









# రచయిత యితర ముద్రిత రచనలు

"కథతోపాటు అంతరార్థం తెలిస్తే, పురాణాలని ఎవరైనా నిందిస్తూంటే విని ఊరుకోలేం. సరైన సమాధానాన్ని చెప్పి ప్రాచీన ఋషుల ఆశీస్సులని పొందగలం".

ఈ భావంతో వ్రాయబడిన డాక్టర్ మైలవరపు శ్రీనివాసరావు రచనలు

శ్రీమద్ వాల్మీకి రామాయణాయనమ్

| | | |
|---|---|---|
| 1) | బాలకాండము(కథ మరియు విశేషాంశాలతో)(2వ ముద్రణ) | 40-00 |
| 2) | అయోధ్యాకాండము (కథ మరియు విశేషాంశాలతో)(2వము) | 35-00 |
| 3) | సుందరకాండము(నిత్యపారాయణానికి వీలుగాకూడ)(3వము) | 50-00 |
| 4) | ఉత్తరకాండము (కథ మరియు విశేషాంశాలతో) | 40-00 |
| 5) | తుండము నేకదంతమును (వినాయకుని సర్వవిశేషాలూ వినాయక వ్రతకల్పమూ కథాఅర్థాలతో) (2వ ముద్రణ) | 10-00 |
| 6) | శ్రీ లలితా సహస్రపూజా నామమంత్రార్థ వివరణం (2వ ము) | 35-00 |
| 7) | శ్రీ మద్భాగవతమూ అంతరార్థ సౌందర్యమూ | 45-00 |
| 8) | మాంగల్య తంతునానేన (పెళ్లిమంత్రాలకి అర్థమూ విశేషాంశాలూ) (3వ ము.) | 40-00 |
| 9) | శ్రీ విష్ణు సహస్రనామమూ అంతరార్థరూపమూ) | 45-00 |
| 10) | అనగనగా........(కొన్ని ప్రాచీన శ్లోకాలూ-వాటి వెనుక దాగిన కథలూ-పిల్లలకీ పెద్దలకీకూడా కథారసాయనం) | 15-00 |
| | | 355-00 |

1. పై సెట్టు మొత్తం కావలిస్తే రు. 330/-కు, రిజిస్టర్డ్ బుక్‌పోస్టుచార్జీలు మేమే భరించి పంపిస్తాం.
2. మూటికి మించి పుస్తకాలు కావలసివస్తే మీకు పోస్టు చార్జీల ఖర్చు లేదు సరికదా 10% మినహాయింపు సౌకర్యం కూడ.

-: 1998 మార్చి 31 నాటికి సిద్ధమయ్యే గ్రంథాలు :-

| | | |
|---|---|---|
| 11) | అరణ్య కాండము | 45-00 |
| 12) | కిష్కింధా కాండము | 45-00 |
| 13) | యుద్ధ కాండము | 60-00 |
| 14) | పండుగలూ-అంతరార్థమూ-కర్తవ్యమూ | 50-00 |

ప్రతులకు : డా॥ మైలవరపు శ్రీనివాసరావు
5-21-37. 2/6, బ్రాడీపేట, గుంటూరు-2.
పిన్ : 522 002 (A.P.) INDIA. ☎ 0863-354611.